

Chandamama, December '50 Photo by A. L. Syed

గుర్రము స్వారీ

సోలార్ పెన్స్...
దృఢంగా
మన్నికకు
అందమునకు
ఆనందమునకు

ఎల్లప్పుడు "సోలార్" గమనించుడు

అందరకు అందుబాటులోని ధరలు

శాస్త్రి పెన్ వర్క్సు - తెనాలి

హిందీ విద్యార్థులకు చక్కటి తరుణము!

ప్రాథమిక్ పరీక్షా గైడ్ .... 0-14-0

మధ్యమ పరీక్షా గైడ్ - భాగము 2 1-0-0

(పై రెండు పుస్తకములకు అర్థము కన్నడములో కలదు)

మధ్యమ పరీక్షా గైడ్ - భాగము 1 1-0-0

రాష్ట్రభాషా పరీక్షాగైడ్ 4-భాగములు 3-6-0

(ఈ రెండు పుస్తకములకు అర్థము హిందీలో కలదు)

★

ఉత్తర ప్రత్యుత్తరములు హిందీలోగాని ఇంగ్లీషులోకాని జరుపవలయును

రామాశ్రయ బుక్ డిపో
ధారవాడ

ఆరోగ్యానికి, రుచికరానికి

పూజలకు, వివాహాలకు

REFINED
CAMPHOR
WATCH BRAND
G. C. & CO
PURE CAMPHOR

గడియారం మార్కు కర్పూరము

ఉపయోగించండి

# చందూ యొక్క సాహసకృత్యములు


















ది టాటా ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్

# అట్టమీది బొమ్మ

లోకకంటకుడైన కంసుణ్ణి శ్రీకృష్ణుడు సంహరించినట్లు క్రిందటిసారి చెప్పాము. కంసుడు చనిపోగానే కంకన్యుడు, క్రోధకుడు మొదలైన అతని ఎనమండుగురు తమ్ములూ కృష్ణబలరాముల మీదికి తలపడ్డారు. వాళ్ళందరినీ బలరాముడు ఒక్క చేతిమీదుగా చీల్చి చెండాడి, హతమార్చివేశాడు.

అప్పుడు కంసుని భార్యలూ, అతని తమ్ముల భార్యలూ కృష్ణబలరాముల వద్దకు వచ్చి విలపింపసాగారు: "మహాత్ములారా! అవతారపురుషులైనటువంటి మీపైకి దండెత్తి రావడం ఎవళ్ళకైనా తగునా? ఎంత అవివేకము! అందుకనే మా భర్తలు మీ చేతులలో మరణించారు. వారు అలా మరణించటం ఆశ్చర్యమేమున్నది?" అంటూ మనసు విడిచి వారు తమ ఆవేదన వెల్లడించేవరకు, కృష్ణబలరాములు వారిపైన జాలిచెంది వారి భర్తల ఉత్తరక్రియలను తామే స్వయంగా జరిపించారు.

తరువాత కృష్ణబలరాములు, చెరలో బంధింపబడివున్న తలిదండ్రులవద్దకు పోయి, దర్శనం చేసుకున్నారు. వారు కంటబడగానే దేవకీవసుదేవులు ముద్దుబిడ్డలను కౌగిట చేర్చుకుని "నాయనలూ! ఎన్నాళ్లకు చూడగలిగినామురా మిమ్మలిని? కన్నులు కాయకాచిపోయినవే!" అంటూ ఆప్యాయత ఉట్టిపడేట్టు ముద్దులాడబోచ్చారు.

ప్రేమమూర్తులైన తలిదండ్రుల ఒడిలో ఇమిడిపోయినారు శ్రీకృష్ణబలరాములు: "జననీజనకులారా! ఆ కంసునికి వెరచి ఇంతకాలమూ మేము మీ ఎదుటకు రాలేకపోయాము. మిమ్మల్ని పరాధీనంలో ఉంచవలసివచ్చినందుకు ఎంతో పరితపిస్తున్నాము. మా తప్పు మన్నించండి" అని చెబుతూ, వారు క్రూర రాక్షసులెందరినో సంహరించిన వృత్తాంతాలన్నీ పూసగుచ్చినట్లు వివరించారు. ఆ చిత్రకథలన్నీ విని దేవకీవసుదేవులు ఆశ్చర్యపోయారు. కేవలమూ అవతారపురుషులైన కృష్ణబలరాములే తమకు పుత్రులుగా పుట్టినందుకు తమ జన్మ పావనమైపోయిందని పొంగిపోయి, వారు ఉత్సాహంతో ఆనందబాష్పాలు రాల్చారు.

# చందమామ

పిల్లల కథల మాసపత్రిక
సంచాలకుడు: చక్రపాణి

పిల్లలు చందమామకు వ్రాసే జాబులు ఎంతో చిత్రంగా వుంటాయి. వాటిల్లో వారుచూపే ఆదరమూ, అభిమానమూ వెల్లడి కావటమే గాక, వారి అమాయికహృదయంకూడా స్పష్టంగా కనిపిస్తుంది. "చందమామ అంటే యేమిటో తెలుసా? — మా మ్యునిసిపల్ హైస్కూలు వీవింగు మాష్టారు పరీక్ష హాల్లోకూడా శ్రద్ధగా పఠించే పత్రిక. వారి వయస్సు 54 సంవత్సరాలు" అంటూ ఒక విద్యార్థి వ్రాస్తున్నాడు. మరిఒక ఉత్తరంలో "పోస్టుమాన్ చందమామ తెచ్చి యివ్వగానే మా చేతుల్లోంచి ముందుగా మా తాతయ్య లాక్కుంటాడు" అని ఇంకొక విద్యార్థి సోదరుడు ఫిర్యాదు చేస్తున్నాడు. నిజానికి ఇవన్నీ చందమామకు గౌరవాన్ని సమకూర్చే విషయాలే. ఇటువంటి జాబులు రోజూ వందలకొద్దీ అందుకోవటానికి వినోదంగానే వుంటుంది. ఒక ఉత్తరంమీద చిరునామా ఇలా వున్నది; "To the Stories Grandfather, Moon Office, Madras" అదీ మాకు సరిగానే చేరింది. దీన్నిబట్టి చందమామ విషయంలో తపాలాశాఖవారుకూడా ఎంతటి శ్రద్ధ, ఉత్సాహమూ చూపుతున్నారో విశదమవుతున్నది. కాని, యిక్కడ ఒక విషయం మీకు తెలియచేయవలసివుంది. అడ్రసు ఏవిధంగా వ్రాసినా మీ ఉత్తరాలు మాకు చేరుతున్నవి కదా అని, మీయిష్టంవచ్చినట్టు అడ్రసు వ్రాయకూడదు. సరియైన అడ్రసు లేకపోతే మీ ఉత్తరాలు మాకు అందక పోవచ్చు, లేదా ఆలస్యంగా అందవచ్చు. కనుక సరియైన అడ్రసు వ్రాయండి.

సంపుటి 7
సంచిక 6

డిసెంబరు
1950






# ఐకమత్యం

ముదుసలి యొకనికి కొడుకులు ముగ్గురు
జగడంలో ఏ ఒక్కరు తగ్గరు.
వారందరు తమలో తామే కడు
వాదులాడుకొంటా రెల్లప్పుడు.

అది చూస్తే ఆ తండ్రికి కోపం
కాని ముసలివాడాయెను పాపం!
వారు తనంతటివా రయ్యారా?
చేయి చేసుకొంటే వింటారా?

'ఏమిటి చెయ్యడమా!' అని యోచన
లో పడ్డా డాతడు తన మనమున
చివరకు తట్టిం దొక్క ఉపాయం
డిగులంతా జనది మటుమాయం.

అప్పుడు ముదుసలి నౌకరుచేతను
తెప్పించా డొక పుల్లల మోపును.
తదుపరి తన కొడుకులను ముగ్గురను
పిలచి నిలువమన్నాడు దగ్గరను.

'అబ్బాయిలు! మీలో ఎవడైనా
ఈ పుల్లల మోపును విరవేనా?
మోపు మోపుగానే విరవాలి!
అప్పుడు మీ పస బయటపడాలి!'

రచన:
'బైరాగి'

పెద్దవాడు తన తండ్రి మాట విని
ఆ పుల్లల మోపును తన చేగొని
చూపాడిక ఓపిక ఎంతైనా,
అది లాభించ లేదు మంతైనా.

పక్కకు తొలిగా డతడు సిగ్గుపడి,
రెంతోవా డొచ్చా డిక వడివడి
విరువలేక పోయా డతడున్నూ
ఓడినాడు మూడోవాడున్నూ.

తండ్రి వారితో అన్నా డంతట
'మీ రా పుల్లలు విడిగా తుంచుట
మంచిది.' అనగానే పటపటమని
తుంచేశారా పుల్లలన్నిటని.

అప్పుడు తండ్రి 'బిడలారా! ఇక
ఎన్నడు వాదులాడకం డూరక
ఐక్యంగా ఉన్నంతటివరకూ
ఏ ఆపదా రాదు మీ దరికి.

పులల్లా విడిపోయారంటే
తగువుల్లో పడి పోయారంటే
మీ రలాగనే చెడిపోతా' రని
మందలించి తెచ్చా డొక దారికి.





# నేస్తం, నేస్తం వస్తావా?

"మహేశ్వర్" (మద్రాసు)

నేస్తం నేస్తం వస్తావా
పలకా బలపం తెస్తావా
పాటలు, పద్యాల్ రాస్తావా ?

నేస్తం నేస్తం వస్తావా
చారెడు బియ్యం తెస్తావా
వంకాయ్ముక్కలు కోస్తావా ?

నేస్తం నేస్తం వస్తానూ
చాయాపప్పూ తెస్తానూ
పప్పూ బియ్యం కలబోసీ
కమ్మటి పులగం చేదాము.

నేస్తం నేస్తం వస్తావా
పాలూమీగడ తెస్తావా
గుజ్జన గూళ్లకి వస్తావా
బొమ్మకి లాలలు పోస్తావా ?

నేస్తం నేసం వస్తానూ
బొమ్మకి గౌనులు తెస్తాను
ముత్తాబంతా చేస్తానూ
పుట్టినరోజూ చేదాము.

నేస్తం నేస్తం విన్నావా
నేరు లక్కవలె పండూతే
మంచి మొగుడొస్తాడంట

నేస్తం నేస్తం వస్తావా
నాతో పందెం వేస్తావా
ఓడితె మారాం చేస్తావా ?

నేస్తం నేస్తం వస్తావా
గంధం మెడకూ పూస్తావా
పందిరిమంచం వేస్తావా
బొమ్మకి హారతి ఇస్తావా ?

నేస్తం నేస్తం వస్తావా
ఆకూ వక్కా తెస్తావా
తెల్లటి సున్నం తెస్తావా
కమ్మని కిల్లీ వేస్తావా ?

నేస్తం నేస్తం వస్తాను
ఆడుతు పాడుతు వస్తాను
చందమామను తెస్తాను
చక్కటి కథలు చెబుతాను.




ఈ సృష్టికి మొట్టమొదట ఆదిశక్తిని పుట్టించాడట భగవంతుడు. శక్తిస్వరూపిణి ఐనటువంటి ఆ జగన్మాత జన్మించగానే "ఓయి దేముడా!—నన్ను పుట్టించావు, బాగానేవుంది. ఐతే, నాకు ప్రతి జంతుబలి కావాల్నే. మరి, నా ఆహారంమాట ఏమైనా ఆలోచించావా?" అని అడిగింది.

అందుకు భగవంతుడు "దేవీ!—దీని కేమున్నది. ప్రపంచంలో లక్షలాది జంతువు లున్నవికదా! ఐతే, ఏ జంతువు రక్తం ప్రశస్తమైందో, ఏది నీకు బాగా రుచిస్తుందో తెలియాల్సివుంది. ఇందుకోసమని ఇదగో యిప్పుడే పోయిరమ్మని దోమరాజును పంపిస్తున్నాను," అని చెప్పాడు.

దేముని ఆజ్ఞప్రకారం దోమరాజు బయల్దేరిపోయి, ప్రపంచంలో ఉండే ప్రతి జంతువు శరీరమూ తన వాడి తొండంతో పొడిచి రక్తం పీల్చి చవిచూస్తూ వచ్చింది. ఏజంతువు రక్తం ఎంతరుచిగా వుంటుందో స్వయంగా తెలుసుకుంది.

దోమరాజు ప్రపంచమంతా చుట్టి తన పని ముగించుకుని తిరిగి వస్తూ ఉండగా దారిలో ఒక చెట్టుమీద బల్లిబావగారు కనిపించి, పలకరించారు: "ఓహో దోమరాజుగారూ!—ఇవాళ ఎంత సుదినం! ఎంత సుదినం!! ఎక్కడినుంచి ఈ రాక? రండి, ఇలావచ్చి ఈ చెట్టునీడని కాస్తంత విశ్రాంతి తీసుకోండి!" అంటూ ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించింది.

బల్లిబావ ఇంత ఆప్యాయంగా పిలవటం చూచి, "భేష్!—బాగానే వున్నది. నేనీ ప్రపంచమంతా సంచారంచేసే మహా కార్యంలో ఈ బల్లిమాట మరిచే పోయాను. అవకాశం దొరికింది గనుక ఇప్పుడు ఈ పనికూడా ముగించుకు మరీ పోవచ్చు" అనుకుని దోమరాజు సంతోషించింది.

సి. సుగుణావతి, సైదాపురం



"దోమరాజా! ఇవాళ చాలా గొప్ప విషయం చెవిని వేశావు. ఐతే ఇంత ప్రపంచం చుట్టి వచ్చావుకదా ఏ జంతువు రక్తం నీకు నచ్చింది?" అంటూ ఆత్రంతో ప్రశ్నించింది బల్లిబావ.

"ఇన్ని జంతువులను చూచుకు వచ్చాను కాని బల్లిబావా!—మనిషి రక్త మంత రుచి మరి ఏజంతు రక్తానికి లేదు సుమా. ఈసంగతే నేను యిప్పుడు వెళ్ళి దేవికి నివేదించుకుందా మనుకొంటున్నా" నని చెప్పింది దోమ.

ఇంతలోనే మాటా పలుకూ అడుతూ బల్లిబావ కుశలప్రశ్న లడిగేసరికి దోమ రాజు "బల్లిబావా! బల్లిబావా! నీకింకా తెలియనే తెలియదా? శక్తి స్వరూపిణి ఐనటువంటి జగన్మాతను భగవంతుడు సృష్టించి వున్నాడు. ఆ దేవికి ఆహారముగా ఏ జంతువు రక్తము తగినవిగా వుంటుందో పరీక్షించి రమ్మని నన్ను దూతగా పంపిం చారు. ఆపనిమీద ఇప్పుడు ప్రపంచమంతా పర్యటనంచేసి ప్రతి జంతువుయొక్క రక్తమూ చవిచూచి, నా అభిప్రాయం తెల్ప టానికని తిరుగా భగవంతునివద్దకు పోబో తున్నాను" అన్నది.

ఈమాటవిని, తన ప్రసక్తి లేదుగనక తనజాతికి గండం తప్పిందికదా అని బల్లి బావ మనసులో సంతోషించింది. పైగా, ప్రపంచంలోని లకలాది జంతువుల రక్తం ఆరగించి వచ్చిన ఈ దోమరాజు రక్తం ఎంత రుచికరంగా వుంటుందో చూడాలని కుతూహలంకూడా పుట్టింది. బడలికవల్ల దోమరాజు కాస్తంత కన్ను మూయటం కనిపెట్టిన బల్లిబావ, వెనకపాటునే వెళ్ళి ఏమైతే ఐందని చెప్పి, దాన్ని గుటుక్కున మింగివేసింది. ఇంకేముంది?—ప్రపంచ మంతా చుట్టివచ్చిన అంతటి దోమరాజూ బల్లిబావకు బలి ఐపోయిందన్నమాట!



ఏదో జిహ్వాచాపల్యంచేత బల్లిబావ ఇలా చేసిందే కాని, దోమరాజును మింగి నప్పటినించీ దానికి కడుపులో గాభరా పుట్టుకొచ్చింది—కేవలమూ ఆదిశక్తిచేతనే పంపబడినటువంటి దూతను కొంచెమైనా ఆలోచనలేకుండా ఇలా పొట్టబెట్టుకున్నానే, ఈ సంగతి ఎప్పటికైనా దేవి కనిపెట్టలేక పోతుందా? కనిపెట్టిన తరువాత నన్ను శిక్షించకుండా ఊరుకుంటుందా? కనుక, ఎలాగ యిప్పుడు? తీరా దోమరాజును మింగివేశానే, దీని ప్రసక్తి వచ్చినట్టయితే ఏమి సమాధానం చెప్పుకోవటం అని ఇలా తనలో తనే మధనపడజొచ్చింది.

ఐనా, ధైర్యంచేసి బల్లిబావ భగవంతుని వద్దకు ప్రయాణం కట్టింది. అక్కడ చూడగా అప్పటికప్పుడే ఎంతో కోలాహలంగా వున్నది. 'దోమరాజుగారు ఎంతటు వస్తారా, ఏమి కబురు తెస్తారా?' అని అక్కడ చేరిన ప్రతి జంతువూ ఆత్రంతో ఎదురు చూస్తున్నది.

ఇంతకుముందే దోమరాజు అన్ని జంతువుల రక్తమూ ఒక్కటీ వదలకుండా చవి చూచినట్టూ, ఆయనకు మనిషి రక్తమే అన్నిటికంటె ప్రశస్తంగా కనబడినట్టూ ఒక పుకారు పుట్టింది. దానితో మానవు లంతా 'మన పని అయిందిరా బాబూ!' అని బెంగతో దిగాలుపడి కూర్చున్నారు. తక్కిన జంతువులు మాత్రం తమకేం ఫరవాలే దనుకుని సంతోషంగా ఉన్నాయి.

మరికొద్ది సేపటికల్లా బల్లిబావ అక్కడికి చేరుకుని దేవి ఎదట నిలబడి వినయంగా నమస్కరించి, "తల్లీ! నేను దోమరాజు దూతనండి. ప్రపంచమంతా పర్యటనచేసి వచ్చిన మా రాజావారు సుకుమారులు కావటంచేత బడలిక తీర్చుకొంటున్నా రండి..." అంటూ నెమ్మదిగా ఏదో కల్పించి చెప్పసాగింది.

అప్పుడు దేవి "సరేనయ్యా, ఆ దోమ రాజుగారు వెళ్లివచ్చిన పని యేమైంది? పర్యవసాన మేమిటి? ముందు ఆసంగతి చెప్పు"మంటూ వేగిరపెట్టింది.

ఇలా జగన్మాత తనను ఆత్రంతో ప్రశ్నిస్తుందని బల్లిబావ తలచి ఉండ లేదు. కనుక, కంగారుపడుతూ తడబడే మాటలతో "మనిషి రక్తం— మనిషి రక్తం!" అని చెప్పేదా మనుకుని, నోరు తిరక్క "మహిషి రక్తం—మహిషి రక్తం!!" అనేసి వూరుకుంది.

మందహాసంతో దేవి "సరే, దోమరాజు పంపిన కబురు చాలా బాగా వున్నది. ఇంతటినుంచీ నాకు చేసే జాతర్లలోనూ పూజలలోనూ మహిషాలనే బలియిస్తూ వుండండి!" అంటూ అజ్ఞయిచ్చి, అంత ర్ధానమైపోయింది.

అప్పుడు మానవజాతికి గండం తప్పిం దిరా దేముడా అని ముఖాలు కలకల్లాడ జొచ్చినై. వారికి కలిగిన సంతోషం ఇంతింత కాదు. మానవులంతా చేరి వెంటనే అడవిలో బల్లి నివసించే చెట్టువద్దకుపోయి "ఓయి బల్లిబావా బల్లిబావా!—నీవు మా జాతికి చేసిన మహోపకారం మరువరానిది. ప్రాణభిక్ష పెట్టిన మహానుభావుడవు. గాన నిన్ను ఎల్లప్పుడూ గౌరవించవలసిన విధి మాపైన వున్నది. ఇందుకుగాను మేమొక్క కోరిక కోరుతున్నాము. దానిని తప్పక మన్నించాలి. అది ఏమిటీ అంటే—నీవు ఇలా అరణ్యాలలో చెట్లమీదా గట్లమీదా కాలక్షేపం చేయటం పనికిరాదు. మేము కట్టుకునివుండే గృహాల్లో మాతోపాటేవుండి మాకు నీ నిత్యదర్శనం ఇప్పిస్తూవుండాలి. ఇదే మా అభిలాష" అని విన్నవించారు.

మానవుల మనవిని పాలించటంకోసమే కాబోలు, ఈనాడుకూడా ఇల్లు కట్టుకునే సరికల్లా ముందుగా బల్లివచ్చి గృహప్రవేశ మయి గోడమీద ఎక్కి కూర్చుంటున్నది.






## 6

[తన ముద్దుల కుమార్తెలు—సుహాసినీ, సుభాషిణీ, సుకేశినీలను వెతికి తెచ్చినవానికి తన రాజ్యం యిస్తానని రాజు చాటింపించటం, అది విన్న భద్రపురి కవలలు ఉదయనుడూ, నిశీథుడూ, సంధ్యాకుమారుడూ రాకుమార్తెలను వెతుక్కొంటూ బయలుదేరటంవరకూ క్రిందటినెల చదివారుకద. ఆతర్వాత ఏమి జరిగిందీ అంటే।]

తెల్లగుఱ్ఱంపైన ఉదయనుడు ముందు పోతున్నాడు. పట్టపగలు కావటంవల్ల ఉదయనుడికి బాధలేదు. కాని సంధ్యా నిశీథుల సంగతేమిటి? వాళ్ళకు కళ్లువుండి కూడా గ్రుడ్డివాళ్ల కిందనే లెక్కకదా! అందుచేత దారితెలియకపోయినా ముందు పోతున్న ఉదయనుడి గుఱ్ఱపు డెక్కల చప్పుడు ఆనవాలుగా పెట్టుకుని అతని వెంటన్నే పోతూ వున్నారు. క్రమంగా సూర్యుడు పడమటికి క్రుంగజొచ్చాడు. "నాపని అయిపోయింది—ఇకనువ్వు దారి చూపు సంధ్యా" అన్నాడు ఉదయనుడు. ఆమాటప్రకారం ముందు సంధ్య దారి తీయుగా, అతని వెనక నిశీథుడు, ఆవెనక ఉదయనుడు వెళుతున్నారు.

అలా పోయి పోయి బాగా చీకటిపడే వేళకు వాళ్ళు ఒకపెద్ద అరణ్యం చేరుకున్నారు. చీకటి పడటంవల్ల యిక ఉదయనుడూ, సంధ్యా విశ్రాంతి తీసుకోవలసినవాళ్లే. కాని అర్ధరాత్రివేళ ఆ నట్టడవిలో ఎక్కడని విశ్రాంతి తీసుకోవటం? అప్పుడు నిశీథుడు వాళ్ళని ఒక చెట్టుపైన కూర్చొబెట్టి—"మీరు యిక్కడే వుండండి. నేనుపోయి ఈరాత్రికి మీరు తలదాచుకునేందుకు వీలైన చోటు ఎక్కడైనా ఉందేమో చూచివస్తాను" అని వాళ్ల



గుఱ్ఱాల్ని ఆ చెట్టుకే కట్టివేసి, తన నల్ల గుఱ్ఱంపైన బయలుదేరాడు.

నిశీథుడు చాలా దూరం పోయి చివరకు ఆ అరణ్యమధ్యంలో ఒక పాడుబడ్డ యింటి వద్దకు చేరుకున్నాడు. వాకిలిదగ్గిరికి వెళ్ళి తలుపుతట్టి చూచాడు. జవాబు లేదు. కిటికీ దగ్గిరికివెళ్ళి తొంగి చూచాడు— లోపల అలికిడి యేమీలేదు. ధైర్యంచేసి తలుపు తెరుచుకుని యింట్లోప్రవేశించాడు. ఏమూల చూచినా నారపీచు కుప్పలే. అంతకుతప్ప ఆ యింట్లో విచిత్రమేమీ లేదు. ఇంటి యజమాని ఎవరో చూద్దామని కొంతసేపు అక్కడే వేచివున్నాడు. కాని ఎంతకూ ఎవరూ రాకపోయేసరికి అది ఏదో పాడుబడిన యిల్లుఅయివుంటుందనుకున్నాడు. తనకూ, తన సోదరులకూ అది తల దాచుకోటానికి తగిన స్థలమేనని నిశ్చయించుకొని, తిరిగి నల్లగుఱ్ఱంపైన బయలుదేరి ఉదయనుడూ, సంధ్యా వున్న చెట్టు వైపుకి సాగాడు.

నిశీథుడు అక్కడ సోదరులను కూర్చొబెట్టి వచ్చేసిన మరుక్షణమందే ఉదయనుడూ, సంధ్యా ఎక్కిన చెట్టుక్రిందని ఏదో అలికిడి అయింది. పురుగూ పుట్రా వుండే అడవికదా, అటువంటి దేదైనా అయివుంటుందనుకుని వాళ్ళు ఆత్రంతో అలాగే నిశీథునికోసం ఎదురుచూస్తూవున్నారు.

ఉన్నట్టే వుండి ఉదయనుడు తన నడుము చుట్టూ తడిమి చూచుకొని "సంధ్యా! ఏదో నారపీచులాగా తగులుతోంది ఏమిట్రో నడుముకి" అనబోయాడు. ఉదయనుడి నోటినించి ఈ మాటలు పూర్తిగా వచ్చాయో లేదో సంధ్యకూడా అవును, "నా నడుముకీ అలాగే తగులుతోంది. నీవు చెప్పినట్టు ఏదో నారపీచులాగానే కనబడుతూవుంది. ఏమైవుంటుందీ చెప్మా?" అని ఆలోచించసాగాడు.

ఇలా వాళ్లు ఆలోచిస్తూవుండగానే వాళ్ల నడుముచుట్టూ ఏదో తాడు బిగించి లాగ బడుతున్నట్టు ఇద్దరూ గ్రహించారు. చేతులతో చుట్టూ తడిమిచూచారు. ఎక్కడా మనిషి అలికిడి కనుపించలేదు.

ఇంతలో—"మహామహావాళ్ళకే నేను కనుపించలేదు, మీ కా కనుపించేది?" అనే మాటలు వినిపించినై.

ఎప్పుడైతే ఈ మాటలు వినిపించినయ్యో, అప్పుడు తమని ఏదో దెయ్యమో భూతమో యిలా తాటితో బిగించివుంటుందని ఉదయనుడూ సంధ్యా తెలుసుకున్నారు. కాని ఏమిచెయ్యాలో తోచింది కాదు. "సమయానికి మా నిశీథుడు లేక పోయాడు గాని, వుంటే నీ అంతు కనుక్కొని వుందుము. ఇప్పటికైనా మించిపోయింది లేదులే. మాఅన్నయ్య ఈపాటికి బయల్దేరి వస్తూనే వుంటాడు. వాడు వచ్చేలోగా మర్యాదగా మమ్మల్ని వదిలిపోతావా సరే సరి—లేదా ఈరోజునే నిన్ను యమలోకానికి పంపించివేస్తాడు" అని బెదిరించి చూచారు.

కాని ఆ వచ్చినవాడు సామాన్యుడా? "ఓస్! మీ బెదిరింపులు నాదగ్గరనా?





మీ అన్నయ్యలాటివాళ్లు ఒకరుకాదు వంద మంది వచ్చినా నన్నేమీ చెయ్యలేరు. అయినా మీ అన్నయ్య వచ్చేవరకూ నేను యిక్కడ వుండబోయాను గనకనా?" అంటూ ఆ వచ్చినవాడు వాళ్లని తన గడ్డం చివర కట్టి చరా చరా సాగిపోయాడు. పోతూ పోతూ ఆ వచ్చినవాడు మరొక కొంటెపనికూడా చేసిపోయాడు. చెట్టుకి కట్టివున్న రెండు గుఱ్ఱాలపైనా ఏదో భస్మం చల్లాడు. అలా చల్లటంతోటే అవి రెండూ మాయమైపోయాయి.

మరికొంతసేపటికల్లా నిశీధుడు చెట్టు వద్దకు వచ్చి చూచేసరికి ఏమున్నదీ— చెట్టుపైన తన సోదరులూలేరు, చెట్టుక్రింద వాళ్ల గుఱ్ఱాలూలేవు. అతనికి ఏమీ తోచింది కాదు. ఒకవేళ తను రావటం ఆలస్యం అయిందని చెప్పి వాళ్ళు తనని వెతుక్కుంటూ మరోదారిన వెళ్లారేమో నను కుని, సోదరులను వెతుక్కుంటూ, తన నల్లగుఱ్ఱంపైన తిరుగుముఖం పట్టాడు. అలా వెతుక్కుంటూ నిశీధుడు ఆ మహారణ్యమంతటా కలియతిరిగాడు. కాని ఎక్కడా వాళ్ళ ఆనవాలు చిక్కిందే కాదు. అప్పటికి రాత్రికూడా చాలాభాగం గడిచిపోయింది. మరో రెండు గంటలలో తెల్లవారబోతుంది. తీరా తెల్లవారిందీ, అంటే తను ఒక్క అడుగైనా ముందుకు వెయ్యలేడు. అందుచేత ఆఖరు ప్రయత్నంగా మరొక్కసారి అడవి అంతా గాలించాడు. లాభం లేకపోయింది.

చివరకు ఒక ఆలోచన తట్టింది— "ఒకవేళ వాళ్లు నేను చూచివచ్చిన ఆ యింటికే వెళ్ళారేమో" అని అనుకొన్నాడు. ఈ ఆలోచన స్ఫురించగానే గిరుక్కున మళ్లీ తిరుగా ఆ పాడుబడిన యింటికివచ్చి చేరుకున్నాడు. తన సోదరులు గుఱ్ఱాలను బైట కట్టివేసి వుంటారుకదా అని తలిచాడు

23



నిశీథుడు. కాని అలా ఏమీ కనిపించక పోయేసరికి నిరాశ చెందవలసి వచ్చింది. అయినా చూద్దామని చెప్పి తలుపు తోసుకుని యింట్లోకి వెళ్ళాడు. ఎంత వింత!! ఒక లావుపాటి నారత్రాటితో కట్టబడి ఉదయనుడూ, సంధ్యా ఆ గదిమూల నిద్రిస్తూ వున్నారు. పైగా వాళ్లకి దగ్గరలోనే నేలమీద నెత్తురు చుక్కలు కనుపిస్తున్నై. అంతకంటే ఘోరం!—ఉదయనుడి చెయ్యి ఒకటి మాయమైపోయింది. పోనీ అంటే నరికివేసిన గుర్తయినా లేదు.

ఇదంతా చూచి నిశీథుడికి మతిపోయిన ట్టనిపించింది. కొంతసేపటికి స్తిమితం తెచ్చుకొని సోదరులను తట్టి లేపాడు. నిశీథుణ్ణి చూడగానే వాళ్లకి ప్రాణం లేచి వచ్చింది—"తమ్ముడూ!- ఆ దుర్మార్గుణ్ణి తప్పించుకుని ఎలా వచ్చావురా? మళ్లీ మనం కలుసుకుంటామని ఆశపడనేలేదు మేము" అంటూ నిశీథుణ్ణి కౌగిలించుకొని, కన్నీరు కార్చారు సోదరు లిద్దరూ.

"మీకు వచ్చిన భయంలేదు. విచారించ కండి. యిక్కడికి కెలా వచ్చారు మీరు? ఈ కట్లేమిటి? అన్నయ్యా!—నీ చెయ్యేమయింది? ఈ నెత్తురు చుక్కలేమిటి?" అని ఆత్రంకొద్దీ ప్రశ్నలు కురిపించాడు, నిశీథుడు.

"ఇదంతా మన దురదృష్టం తమ్ముడూ! నీవు మమ్మల్ని వదిలి వెళ్లిన కాసేపటి కల్లా మమ్మల్ని ఎవడో తాటితో కట్టితెచ్చి ఈయింట్లో పడేశాడు. ఆ దుర్మార్గుడు ఎవడో, మమ్మల్ని ఎక్కడికి తీసుకుపోతు న్నాడో మేము చీకటిలో తెలుసుకోలేక పోయాం. ఎప్పుడు తెల్లవారుతుందా అనేదే మా ఆరాటం. ఇప్పుడిప్పుడే తెల్లవారబో తున్నది కనుక నేను కొంచెం చూడగలి గాను. మమ్మల్ని యిక్కడికి కట్టి తెచ్చిన వాడు ఒక విచిత్రమైన మనిషి. వాడిని




చూస్తే మాకు నవ్వూ వచ్చింది, కోపమూ వచ్చింది. భూమికి సరీగా జానెడంటే జానెడెత్తునే వున్నాడు. కాని చిత్రమేమిటంటే వాడికి వందజానెలు పొడుగు గల గడ్డం వుంది. ఆ గడ్డాన్నే మా నడుముకు చుట్టి తాడులాగా పేనాడు. ఇప్పటివరకూ వాడూ మా ప్రక్కనే పడుకుని వున్నాడు. ఇప్పుడే లేచి ఎక్కడికో పోయినట్టుంది. వాడు లేచేసరికి ఇక్కడ నేలమీద నీ పాదాల గుర్తులు కనిపించినై. అవి కంట పడగానే అగ్గి రగులుస్తూ 'ఓహో మీ పెద్దన్న యిక్కడికి వచ్చి వెళ్ళినట్టున్నాడే? సరే వుండండి. వాడినికూడా పట్టి తెస్తాను' అంటూ గభీమని లేవబోయాడు. ఆ తొందరలో వాడు మమ్మల్ని తన గడ్డానికి కట్టుకున్న సంగతే మరిచిపోయినట్టుంది! నాకు పళ్లు మండి వాడి గడ్డం పట్టుకు పీకేసరికి నాలుగు పీచులు కుదుళ్లకంటా వూడి వచ్చి బొలబొలా రక్తం కారింది.

వాడు కళ్ళవెంట చింతనిప్పులు కక్కుతూ 'ఔరా ఎంత పొగరు నీకు, ఇంతా నయంలే, గడ్డమంతా ఊడలాగేశావు కావు' అంటూ కసిరాడు.

'ఈ నా గడ్డమే నాకు పంచప్రాణాలూ అయివుండె. ఇందులో ఒక్క వెంట్రుక రాలిందంటే ఒక ప్రాణం ఎగిరిపోయిందన్న మాటేకద. ఇప్పుడీ పొగరుబోతు నాలుగు పొడుగుపాటి కేశములు పీకివేశాడే. అవి మళ్ళా ఈ జన్మలో మొలిచే అస్కారమూ లేదు. ఎలా అహోరించేది!' అని గొణుగుకొంటూ, 'అరేయ్, నీ నేరానికి ఇదే తగినశిక్ష, అనుభవించు' అంటూ జేబులోంచి ఏదో అంజనం తీసి నా భుజానికి పూశాడు. అంతే. ఆ మరుక్షణమే నా చెయ్యి మాయమైపోయింది. ఈపని చేసిన తర్వాత వాడు తన గడ్డాన్ని మమ్మల్ని కట్టుకున్నంతవరకు కత్తిరించుకుని సులు

వృగా లేవగలిగాడు. కాని చిత్ర మేమిటంటే, ఆ పొడుగుగడ్డం మళ్ళీ ఎప్పటిలాగానే తయారై వుంది" అని చెప్పి ముగించాడు. ఇదంతా విని నిశీథుడు చాల ఆశ్చర్యపోయాడు.

ఇంతలోకే బాగా తెల్లవారింది. అప్పుడు ఉదయనుడు—"సరే యింక ఆలస్యం చెయ్యటం దేనికి. వాడు నీకోసం తిరిగి తిరిగి విసిగి వేసారి ఈపాటికి మళ్లీ ఇటు వస్తూవుండి వుండాలి. తెల్లవారింది కనుక నిశీథా!—యిక నీవల్ల ఏమీ ప్రయోజనం లేదుకదా? అందుచేత నా బదులు నిన్ను సంధ్యతో కలిపి కట్టివేస్తాను. ఒకచెయ్యి మాత్రమే పైకి కనిపించేట్టు జాగ్రత్తగా కూర్చుని వుండు. తర్వాత సంగతి చూచుకొందాం" అన్నాడు.

సరేనంటే సరేననుకున్నారు ముగ్గురూ. వెంటనే నిశీథుడు వాళ్ళ కట్లు విప్పాడు. ఉదయనుడు లేచి నిశీథుణ్ణి సంధ్యతో పాటు కట్టి పడేశాడు. బైటవున్న నిశీథుడి నల్లగుఱ్ఱాన్ని అక్కడ దగ్గర్లో ఒక గుహలో కట్టేసి, తనుమాత్రం తిరిగి ఆ పాడుబడ్డ యింటికి దగ్గర్లోనే ఒక పొదమాటున నక్కివున్నాడు.



సరిగ్గా మధ్యాహ్నం అయేవేళకు ఆ బారెడుగడ్డపు జానెడు మనిషి—"కానివ్వ ఎక్కడికి పోతాడు? ఇవాళ కాకపోతే రేపు. అంతేకదా? అహహ, అహహ" అంటూ విరగబడి నవ్వుతూ ఉదయనుడు దాగివున్న పొదపక్కనించే పోయాడు.

వాడిని యింట్లోకి పోనిచ్చి ఉదయనుడు మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ ఒక కిటికీ దగ్గిరచేరి యింటిలోపలికి తొంగి చూచాడు. అప్పుడు ఒక చిత్రమైన విషయం ఉదయనుడి కంటబడింది. ఆ బారెడుగడ్డపు జానెడు మనిషి జేబులోంచి ఏదో మందుతీసి నిశీథుడిపైన, సంధ్యపైన

చల్లాడు. వెంటనే వాళ్లు ఆనవాలైనా లేకుండా మాయమైపోయారు. ఆతర్వాత వాడు తన మెడలోవున్న ఒక దండ తీసి అక్కడ ఒక వంకెకు తగిలించాడు. దండ తీసివేశాడో లేదో ఆశ్చర్యం, వాడు మామూలు మనిషి అయిపోయాడు. ఆ గడ్డమూ లేదు ఏదీలేదు.

ఇదంతా ఉదయనుడు కిటికీలోనించి కనిపెడుతూనే వున్నాడు. మెడలోవున్న దండ తీసివేసి వాడు గుర్రుపెట్టి నిద్ర పోయాడు. ఇదే అదనుచూచి ఉదయనుడు మెల్లగా యింట్లో ప్రవేశించి ఆ దండ కాస్తా కాజేసి తెచ్చి తన మెడలో వేసుకున్నాడు. ఇంకేముంది, ఉదయనుడు వెంటనే బారెడుగడ్డపు జానెడు మనిషిగా మారిపోయాడు. ఈ వింతమార్పు చూచి ఉదయనుడికి నవ్వు వచ్చింది. "ఓహో! ఇదా నీ కిటుకు". అనుకున్నాడు మన సులో. ఇప్పుడు తన చొక్కాకుగల జేబు లన్నీ తడిమి చూచుకున్నాడు. ఒక జేబులో ఏదో తెల్లటి భస్మం వుంది. చెట్టు క్రింద గుఱ్ఱాల్ని, యింట్లో మనుషుల్ని గెడ్డంవాడు మాయంచేసింది ఈ భస్మం తోటే. రెండోజేబులో ఒక ఎఱ్ఱని అంజనపు డబ్బీ వుంది. ఉదయనుడి చెయ్యి పోగొట్టింది ఈ అంజనం రాచే. మూడో జేబులో అలాటిదే మరొక పచ్చని అంజనపు డబ్బీ, ఒక పెద్ద తువ్వాలూ, ఇంకా మరి ఏదో నల్లని భస్మమూ వున్నై. ఐతే వాటిలో ఏది ఎందుకు ఉపయోగిస్తుందో ఉదయనుడికి బోధపడలేదు.

---

[గెడ్డపువాడి కిటుకు తెలుసుకొన్న ఉదయనుడు, తనకు చిక్కిన వస్తువులతో ఏమి సాధించగలిగాడు? ఇంతకూ, ఆ బారెడు గడ్డపు జానెడు మనిషి వాళ్లని అంతటితో వదిలాడా, లేదా ? ఈ వింతలన్నీ వచ్చేనెల సంచికలో]






ఒకప్పుడు అస్సాందేశాన్ని గదాపాణి అనే రాజు పరిపాలించేవాడు. రాణి జయమతి. ఆ దంపతులు తమ రాజ్యంలోని ప్రజలను కన్నబిడ్డలవలె చూచుకొంటూ ఉండటంవల్ల ప్రజలు గదాపాణి పాలనలో ఎట్టిబాధలూ లేక హాయిగా ఉంటున్నారు.

ఐతే,—రాజు అనగానే, ఎంత మంచి వానికైనా శత్రువు ఉండక తప్పదు. కనుక, ఇంత మంచివా డనిపించుకొం టున్న గదాపాణికీ ఒక శత్రువున్నాడు. వానిపేరు లారారాజా. లారారాజా వట్టి మూర్ఖుడూ, దుర్మార్గుడున్నూ. అతను తన చేతిలో సైనికబలం ఉన్నదికదా అని, చీటికీ మాటికీ కాస్తంత లోకువగా కనపడే పొరుగురాజుల మీదికి దండెత్తుతూ ఉండేవాడు. అలానే తన మీదికి కూడా ఎప్పుడో ఒకప్పుడు దండెత్తి రావచ్చునని గదాపాణి తలచకపోలేదు.

మరికొద్ది కాలానికల్లా లారారాజా హఠాత్తుగా గదాపాణిపైన దండెత్తి, రాజ్యం లో ఖరుచుకున్నాడు. బలమున్నదికదా అని దండెత్తాడు. ఆశకొద్దీ రాజ్యం లాక్కున్నాడే కాని, గదాపాణి రాజ్యం లాక్కున్నప్పటి నించీ లారారాజాకు మనశ్శాంతి లేక పోయింది. ఏమీ అంటే—లారారాజా క్షత్రియ వంశంలోనివాడు కాడు. అందుచేత అతని పరిపాలనకు ప్రజలు సమ్మతించరు. ఇప్పటిమట్టుకు తనకుగల అంగబలంతో అతను ప్రజను అణిచిపెట్టవచ్చు. ఐనా, త్వరలోనే తిరుగుబాటు రాకమానదని అతనికి తెలుసు. పైగా, గదాపాణి మంచితనమూ, తన దుర్మార్గమూ, రెంటికీ గల తేడా రాజ్యంలోని ప్రజలు బాగా గ్రహించే వున్నారు. ఈ కారణాలచేత కొత్తగా తనకు రాజ్యం కలిసినప్పటికీ, మనసుకి హాయిలేక పోయింది.



అక్కడ గదాపాణి, రాజ్యం పోగానే భార్యతోసహా అడవులు పట్టిపోయి తల దాచుకొన జూచాడు. అతడు కంటికి కనపడకుండా పోయినప్పటికీ లారారాజాకు భయం తీరలేదు. రాజ్యంలోని ప్రజలు ఏకఋమందు తమకు ప్రియుడైన గదాపాణిని వెతికితెచ్చి మళ్లీ గద్దెఎక్కిస్తారో— లేదా, మరొక రాజకుమారుణ్ణి ఎవరినైనా రాజుగా చేసుకుంటారో అని, గుండె పీచు పీచుమంటూనే వుండేది.

ఈ భయంచేత లారారాజా, కంట పడిన రాజకుమారుణ్ణల్లా వికలాంగునిగా చేయనారంభించాడు. ఐతే 'ఇలా ఎందుకు చేసేవాడు?' అని సంశయం కలగవచ్చు. దానికి ఒక కారణం వున్నది. క్షత్రియ వంశంలో అవయవలోపం ఉన్నవా డెవ్వడూ రాజ్యం ఏలటానికి అర్హుడుకాడు అని ఆ కాలంలో ఒక ధర్మం ఉండేది. కనుక కనపడ్డవాళ్ళనల్లా వికలాంగులుగా చేయటంవల్ల రాజకుమారులబాధ తనకు ఉండదనుకొన్నాడు, లారారాజా.

పోతే—ప్రజలకు ఇష్టుడైన గదాపాణి పీడ ఒక్కటి అతనికి మిగిలివుంది. శత్రు శేషం లేకుండా చేసుకుంటే హాయిగా ఉండవచ్చుకదా అని తలచి, గదాపాణిని ఎలాఐనా పట్టి తెమ్మని భటుల్ని పంపాడు.

ఆ భటులు తిరిగి తిరిగి, చివరకు గదాపాణి సంచరించే అడవులు చేరుకున్నారు. ఇన్నేళ్ళుగా అడవులలో తిరుగుతూవున్న గదాపాణికి జాతిరత్నమవంటి తగినటువంటి ఒక చక్కటి కొడుకు పుట్టాడు. వానికి 'రుద్రసింగు' అని పేరు పెట్టుకొని, ముద్దుగా పెంచుకొంటూ, బిడ్డడి సందట్లో కష్టాలు మరచి ఆ దంపతులు కాలక్షేపం చేస్తూ వచ్చారు.

ఇంతలో — లారారాజా పంపిన భటులు కింకరులలాగా కంటపడేసరికి

గదాపాణి గుండె గతుక్కుమన్నది. గభి మని లేచాడు. ముద్దుబిడ్డను చంకనెత్తు కున్నాడు. "రా, రా!!" అంటూ భార్యకు చేయివూపి, తను పరుగుచ్చుకున్నాడు. ఆ పరుగు పరుగు—పోయి పోయి అతను నాగపర్వతాలు చేరుకుని అక్కడ దాగు కొన్నాడు. ఆకంగారులో పాపం, జయమతి మాత్రం భర్తతో సమంగా పరుగెత్తలేక పోయింది. అందుచేత శత్రుభటులుఆమెను పట్టివేసి తీసుకపోయి తమ రాజు ఎదట పెట్టారు. లారారాజా జయమతిని ఎన్ని తిప్పలు పెట్టినప్పటికీ, గదాపాణిజాడ తెలుసుకోలేక పోయాడు. ఒకప్రాణ స్నేహి తుడు వెళ్ళి గదాపాణితో ఇలా జరిగిందని చెప్పాడు. ఈవార్త వినీ వినటంతోనే గదాపాణి తన ముద్దుబిడ్డను ఆ స్నేహితు నికి వప్పగించి తను మారువేషంతో వచ్చి రాజభవనంలో ప్రవేశించాడు.



జయమతి చాలా తెలివైనది కావటం చేత ఆ వచ్చినదెవరో ఇట్టే కనిపెట్టి వేసింది. అతన్ని చాలసేపు తన దగ్గర ఉంచుకోవటం ప్రమాదకరమని కూడా ఆమెకు తెలుసు. అందుచేత, తన మనస్సులోని మాట అతనికి తెలియజెప్పి వెంటనే పంపివేసేటందుకు ఒక చక్కటి యుక్తి చేసింది. అతనిని చూడగానే "చిన్ననాయనా!—ఇక్కడి కెందుకు వచ్చావు? నీకు నాపైన నిజమైన అభిమా నమే ఉన్నట్టయితే వచ్చినదారినే వెళ్లిపో. ఒకవేళ నాభర్త నీకు కనపడటమే జరి గితే, ఈ ప్రదేశానికి రావద్దని చెప్పు. ఇదే నే చెప్పవలసిన మాట" అన్నది.

ఈ సంభాషణ విన్నవాళ్ళందరూ వచ్చి నతడు ఆమె పినతండ్రే అని అనుకున్నారు కాని, భర్తఐవుంటాడని ఒక్కరికీ అను మానం కలగలేదు. ఆమె వుద్దేశం గ్రహిం చిన గదాపాణి వెంటనే కోటదాటి వెళ్ళి

పోయాడు. 'ఎంత దుర్మార్గులైనా ఆడ దానిని చంపుతారా, ఏదో కొంత కాలం నిర్బంధంలో వుంచి వదిలేస్తారుకదా' అని మనస్సులో తలిచాడు, గదాపాణి.

కానైతే — విధివిలాసం మరొకలాగా వుండె. సుకుమార ప్రాణి ఐనటువంటి జయమతి శత్రువుల ఈసడింపులకూ సూటిపోటి మాటలకూ సహించలేక, ఇట్లాటి గతి పట్టిందికదా అనేబెంగతో తనలో తనే కుమిలిపోయి, కొద్దిరోజులకల్లా ఈలోకం విడిచి పోయింది. జయమతినే పంచ ప్రాణాలుగా ఎంచుకొంటూవున్న గదాపాణి ఆమె మరణవార్త చెవిని పడటంతోనే శాశ్వత నిద్రలో మునిగిపోయాడు.

ఈవిధంగా ఆ పుణ్యదంపతులు కైలాస వాసులైనారన్న సంగతి తెలిసినప్పటినించీ, ఇదంతా లారారాజావల్లకదా జరిగిందనే కసిఏర్పడి ప్రజ ఉద్రేకులై, లారారాజాపై పగ సాధించటానికి చూస్తూవున్నారు.

ఇంతలో గదాపాణి కుమారుడు రుద్ర సింగు పెద్దవాడవుతున్నట్టు తెలిసి, ఆ బుడుతణ్ణి తీసి తెచ్చుకున్నారు. ఈసారి ప్రజకు ఎక్కడలేని బలమూ వచ్చేసింది. వేయిరెట్లు ఉత్సాహంతో లారారాజాపైన తిరగబడి, లారారాజాను మరి కనపడ కుండా తరిమివేసి, చిన్నారివాడైన తమ రుద్రసింగుకు పట్టం కట్టారు.

రుద్రసింగు మంచివాడు. దయకల వాడు. ప్రజను చక్కగా పాలించి, తండ్రిని మించిన కొడుకనిపించుకున్నాడు. రుద్రసింగు తన జనని జ్ఞాపకార్థం, శివ సాగరానికి మూడుమైళ్ళ దూరంలో ఒక మనోహరమైన సరస్సు తవ్వించి దానికి 'జయసాగరం' అని పేరు పెట్టాడు. అక్కడ 'జయదళ' మనే గొప్ప దేవళము కూడా కట్టించాడు.

ఈరెండు చిహ్నములు ఇప్పటికీ అస్సాం దేశంలో స్పష్టంగా కనబడుతున్నాయి.






పూర్వం ఒకరాజుగారి కొలువులో పేరన్న అనే మడేలు (చాకలి) ఉండేవాడు.

పేరన్నకు నెల జీతం ఒక వరహా. మంత్రికి రెండు వందల వరహాలు. నెల నెలా రెండేసి వందల వరహాలూ రాజుగారు ఖజానాలోంచి తెప్పించి మంత్రి చేతుల్లో పోస్తూంటే, దగ్గిరేవుండి చూస్తోన్న పేరన్నకి బాధగా ఉండేది. రోజు ఇరవై నాలుగ్గంటలూ తను రాజుగారికి అడ్డమైన చాకిరీ చేస్తూవుండె. తనకి ఒక్క వరహా యేనా వచ్చేది? గంటో రెండు గంటలో ఉండి, ఆ కాగితం యీ కాగితం చూసీ చూడనట్లు తిరగేసి, రాజుగారితో కాస్సేపు మంతనాలాడి చక్కాబోయే మంత్రికి రెండువందల వరహాలా!

తనకూ మంత్రికీ జీతంలో ఇంత అంతరం ఎందువల్లనో ఎంత ఆలోచించినా పేరన్నకు అర్థం అయిందికాదు.

పేరన్న ఉండబట్టలేక ఒకనాడు రాజుగారిని ఈ సంగతి అడిగేశాడు.

వాడి మాటలను, రాజు శాంతంగా విన్నాడే కాని జవాబు ఏమీ చెప్పలేదు. కాని అయన మనస్సులో ఏదో ఆలోచించు తున్నాడు.

ఆసాయంకాలమే రాజుగారు పేరన్నను వెంటబెట్టుకుని షికారు బయల్దేరారు. వారికి రెండు ఫర్లాంగుల దూరంలో కోనేటి గట్టుమీద జనం గుంపుకూడి సందడిగా కనపడ్డారు.

అప్పుడు రాజుగారు మడేలుతో, "పేరన్నా, అదేమిటో చూసిరా" అన్నారు.

పేరన్న కోనేటి ఒడ్డుకి పరుగెత్తి వెళ్ళేడు. వాడుతిరిగి వచ్చేటప్పటికి పదిహేను నిముషాలైంది.

"ఏమిటి పేరన్నా విశేషం?" అని అడిగారు రాజుగారు.

అఖండం సుబ్బులక్ష్మి—మదనపల్లి



"పగటివేషగాళ్లుటండి. జనం వాళ్ళ చుట్టూమూగి కబుర్లు వింటున్నా" రన్నాడు పేరన్న.

"ఏవూరినుంచి వచ్చారీ వేషగాళ్లు ?" అని రాజు అడిగేసరికి, పేరన్న సమాధానం చెప్పలేక పోయాడు. చెఱువుగట్టు మీదకు వెళ్లినప్పుడు వాడాసంగతి కనుక్కోలేదు. "వెళ్ళి కనుక్కు వస్తాను" అంటూ వెళ్లి మళ్లీ ఒకపావుగంటకు తిరిగివచ్చాడు.

"ప్రభూ, ఈ వేషగాళ్లు కూచిపూడి నుంచి వచ్చారుటండి" అన్నాడు.

ఈ సమాధానం విని రాజు పూరుకోలేదు. "ఓహో, కూచిపూడి భాగవతులా వచ్చినవాళ్ళు? ఐతే దివాణంలోకి రప్పించాలే! సరేకాని పేరన్నా, వీళ్లు మన ఊళ్ళో ఎంతకాలం ఉంటారో ?" అని అడిగారు రాజుగారు.

కాని ఆ సంగతి పేరన్న కేంతెలుసు? వాళ్ళని వీడు అడగాలేదు; వాళ్ళు చెప్పాలేదు. "ఉండండి బాబూ, ఆసంగతికూడా కనుక్కుని వస్తాను" అంటూ మళ్లీ చెఱువు ముఖం పట్టేడు. తిరిగి వచ్చేటప్పటికి ఈ మాటు పావుగంటకన్న ఎక్కువే పట్టింది.

"వారం పది రోజులుదాకా ఉంటారుట ప్రభూ" అని చెప్పాడు.

"అయితే మనం వేటకువెళ్ళి తిరిగి వచ్చేవరకూ ఉంటారన్నమాట. ఔనుకాని వాళ్లు ఏమైనా కొత్త నాటకాలూ, వేషాలు నేర్చుకున్నారా, లేక అన్నీ మనం చూసేసినవేనా?" అని మళ్లీ అడిగాడు రాజు.

ఆ సంగతి పేరన్న కెలా తెలుస్తుంది? తెలుసుకోవాలంటే 'దేముడా' అంటూ చెఱువుగట్టుకి మళ్ళీ ఒకమాటు వెళ్ళి రావలసిందే. 'సెలవైతే కనుక్కొస్తాను' అన్నాడు పేరన్న.

"అది మనం ముఖ్యంగా తెలుసుకోవలసిన విషయం పేరన్నా. ఏమంటే,



వీళ్ళు కొత్తవిద్యలేమీ నేర్చి ఉండకపోతే వీళ్ళని దివాణంలోకి పిలిపించనే అక్కర్లేదు." అన్నారు రాజుగారు.

"చిత్తం. వెళ్లివస్తానండి అలాగైతే" అంటూ వెళ్ళాడు పేరన్న.

పేరన్న వెళ్ళి వచ్చేటప్పటికి మళ్లీ అరగంటసేపు పట్టింది. నాలుగుమాట్లు వెళ్ళి రావటంలో మొత్తం గంటకుపైగా కాలం వ్యయమైంది. ప్రతీమాటూ రెండేసి ఫర్లాంగులు వెళ్ళి రావటం. మొత్తం రెండు మైళ్లు పరుగెత్తేటప్పటికి పేరన్నకి చెమట పట్టి ఆయాసంకూడా వచ్చింది.

రొప్పుతూ రొజుతూ తిరిగివచ్చిన పేరన్న, "ప్రభూ, కొత్తనాటకాలు, కొత్త వేషాలు, ఎన్నో నేర్చారుటండి," అన్నాడు.

"ఇంకనేం? అలాగైతే నాటకాలు, వేషాలు తప్పకుండా వేయిద్దాం. మరైతే ఈసంగతి వాళ్లకు చెప్పేవా?" అని తిరిగి ప్రశ్నించారు రాజుగారు.

"ఏ సంగతి బాబయ్యా?" అన్నాడు పేరన్న, మళ్ళీ వెళ్ళిరావాలె కామాలు దేముడా అని అనుకొంటూ.

"వాళ్లు యీ ప్రాంతం విడిచి వెళ్లే లోపుగా మన దర్శనం చేసి, దివాణంలో తమ విద్య ప్రదర్శించవలసి వుంటుందన్న సంగతోయ్" అన్నారు రాజుగారు.

"తమ సెలవు అవందే ఎలా చెప్పటం ప్రభూ?" అన్నాడు పేరన్న.

"మించిపోయింది లేదులే. ఇప్పుడైనా పోయి చెప్పిరావచ్చు" అన్నారు రాజుగారు.

రాజుగారు తనని మళ్లీ చెఱువుగట్టుకి పంపిస్తున్నారనటంతోనే పేరన్నకి ప్రాణం విసిగిపోయింది. "ఇదేమిటి ఈరోజున రాజుగారు ఇలా వేపుకొని తింటున్నారు? ఇదివరకు ఎన్నడూ నాకు ఇలాంటి తికమకలు లేవే. విసనకఱ్ఱ పుచ్చుకొని విసరటం, పక్కలు వెయ్యటం, బట్టలు

ఉతికి ఆరవేసి మడతలుపెట్టటం, ఇలాంటి పనులెన్నో చేస్తున్నానుగాని ఎన్నడూ ఇంత శ్రమ పడలేదు. ఒక్కపనికి ఇన్నిమాట్లు తిప్పడమా?" అనిపించింది పేరన్నకి.

మరో రెండు నిముషాలకి మంత్రి అక్కడకువచ్చాడు. రాజుగారు మంత్రికి చెఱువు గట్టుమీద ఉన్న జనం గుంపు చూపించి, సంగతేమిటో కనుక్కురమ్మని పంపేరు.

మరికాసేపటికి మంత్రి చెఱువుగట్టు నుంచితిరిగివచ్చి, "ప్రభూ, కూచిపూడి నుంచిభాగవతులు వచ్చారు. వారుచెపుతూ వున్న హాస్యపుమాటలు వింటూ జనంఅంతా పోగయారు. ప్రభూ, ఈ భాగవతులు మన గ్రామంలో పదిరోజులవరకూ ఉంటారుట. ఎన్నో క్రొత్త క్రొత్త వేషాలూ నాటకాలు నేర్చేమన్నారు. 'మా ప్రభువులు రేపు వేటకు వెళ్ల నిశ్చయించారు. రెండు మూడు రోజులలో తిరిగి వస్తారు. అప్పుడు మీరు వచ్చి ప్రభువుల దర్శనం చేసుకొండి' అని భాగవతులతో చెప్పి వచ్చాను. విలువుబట్టి ప్రభువులు వారి ప్రదర్శనాలు చిత్తగించ వచ్చును" అని రాజుగారికి మనవిచేశాడు.

రాజుగారు మంత్రికి సెలవిచ్చి పంపి, "పేరన్నా, చూశావా? సంగతిఏమిటో కనుక్కొని రమ్మనేసరికి మంత్రి వెళ్లి ఒక్కమాటుగా ఎన్ని వివరాలు కనుక్కు వచ్చాడో. ఇన్ని వివరాలు కనుక్కోవాలనే మాటే అసలు నీకు తోచలేదు. నేను అస్తమానం అడుగుతూ ఉండడం, నువ్వు వెళ్లి వస్తూ ఉండడం జరిగింది. తెలుసుకోవలసిన సంగతులన్నీ తెలుసుకోవటమే గాకుండా, మంత్రి వాళ్లని ఆహ్వానించాడు కూడా. ఆహ్వానించాడేకాని, 'మీరు నాటకాలు వేద్దురుగాని. రాజుగారు చూస్తారు' అని వాళ్లకి ఏవిధమైన మాటా ఇవ్వలేదు. నీకూ మంత్రికీ గల తేడా ఇప్పుడైనా తెలిసిందా?" అని అడిగారు రాజుగారు.

మడేలు తన అజ్ఞానానికి సిగ్గుపడ్డాడు.






క్రోటిపల్లి అనే గ్రామంలో కోటప్పశాస్త్రి అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయన నిరతాన్నప్రదాత అని పేరుసంపాదించాడు. ఈ కీర్తికంతకూ కారణం అయన భార్య కావమ్మగారే. ఆమె కాశీఅన్నపూర్ణలాగానే వి[illegible] నసుగూ లేకుండా ఎంతమందికైనా వండి వడ్డించేది. ఆ దంపతులకు సోమప్పశాస్త్రి అనే కుమారుడున్నాడు. సోమప్పకు వియ్యమ్మ అనే అమ్మాయిని తెచ్చి పెళ్ళిచేశారు.

కోడలు కాపరానికి వచ్చిన కొత్తలోనే కావమ్మగారు తమ్ముని ఇంట బారసాల కని పుట్టింటికి వెళ్ళవలసొచ్చింది. వెళ్ళబోయేముందు ఆమె కోడలితో, "ఇంటికి వచ్చిన అతిధులకు శ్రద్ధగా వడ్డించాలి సుమా. వడ్డన ఐన తరవాత ఏమి కావలసినా వాళ్లే అడుగుతారని ఊరుకోకూడదు. వడ్డించిన పదార్థాలలో ఏ పదార్థాన్ని వాళ్లు ఇష్టంగా తింటున్నారో కనిపెట్టి ఆ పదార్థం రెండు మూడుమాట్లు తెచ్చి వడ్డించాలి. మొగమోటంవల్ల వాళ్లు వొద్దంటారు. వొద్దన్నారుకదా అని చక్కా పోకూడదు" అని చెప్పి మరీ వెళ్లింది.

కోటప్పశాస్త్రీ కావమ్మగారూ ఊరికి వెళ్లిన మర్నాడే, వారి యింటికి నీలపల్లి నుంచి నీలకంఠయ్యగారు వచ్చి, అరుగు మీద జంధ్యాలు వడుకుతూ కూచున్న సోమప్పశాస్త్రిని చూసి, "అబ్బాయ్, నాకు ఈ రోజున భోజనం ఎక్కడ కుదురుతుంది అని గ్రామంలో వాకబుచేస్తే, వాళ్ళు ఈ ఇల్లు చూపెట్టేరు" అన్నాడు.

సోమప్ప లేచి, "దయచెయ్యండి. వంట ఆలస్యంలేదు" అంటూ నూతివద్దకు తీసుకువెళ్లేడు. నీలకంఠయ్య స్నానంచేసి, తడిగుడ్డ పిడిచి కట్టుకుని, విస్తరిముందు పీటమీద కూర్చుని, మొహంనిండా,

సి. పద్మనాభం, అర్కోణం.




బొమ్మమీదా, బుజాలమీదా విభూతి పెండెకట్లు దిట్టంగా పెట్టి, "అమ్మాయ్, ఇంక వడ్డించవచ్చు" అన్నాడు.

ఆనాడు వియ్యమ్మ కందాబచ్చలీవేసి కూర వండింది. లంక గుమ్మడికాయ, ఎర్రదుంపలు, వంకాయ, ములక్కాడలూ వేసి పులుసు కాచింది. కొబ్బరికాయ పచ్చడి చేసింది. వడ్డన పూర్తిఅయి నెయ్యి అభిగరించాక, నీలకంఠయ్య పరిషంపట్టి కూర కలుపుకొన్నాడు. వియ్యమ్మ నెయ్యి వడ్డించి, అత్తగారు చెప్పినప్రకారం ఆయన ఏయే పదార్థాలు ఇష్టంగా తింటున్నాడో జాగ్రత్తగా కనిపెడుతూ నిలబడింది.

నీలకంఠయ్యకు రెండు నియమాలు ఉన్నాయి: భోజనం చేస్తూన్నంతసేపూ మాట్లాడకపోవటం. రెండోది విస్తట్లో వడ్డించిన ఏ పదార్థమూ పారెయ్యకుండా తినెయ్యటం. ఈ రెండు నియమాలూకూడా చాలా మంచివే. భోజనం చేసినంతసేపూ మాట్లాడకుండా, మరో ధ్యాస లేకుండా తినటం ఆరోగ్యకరమని వైద్యశాస్త్రంలో చెప్పివున్నారు. అలాగాక తిండితింటూ వున్నంతసేపూ వటవటమంటూ వాగుతోంటే, పలకమారటం, ఎక్కిళ్లురావటం మొదలైన ప్రమాదాలు కలగవచ్చు.

ఇంక విస్తట్లో వేసినది పారెయ్యకుండా తినటమనేది కూడా మంచి నియమమే. కొందరి విస్తళ్ళలో, తిన్న పదార్థాలకన్న పారవేసే పదార్థాలే ఎక్కువ. కావలసినంతే వేయించుకు తినటం మంచిదంటే ఎవరు కాదనగలరు? ఈ రెండు నియమాలనూ తండ్రి చెప్పినప్రకారం నీలకంఠయ్య పాటించుతూ వచ్చాడేగాని, అవి ఎందుకోసం ఏర్పరచారో అతడెన్నడూ ఆలోచించలేదు. భోజన సమయంలో తండ్రి మాట్లాడకూడదన్నాడు గనక, పరిషం చేసినది మొదలు ఉత్తరాపోశన

పశ్టేవరకూ మౌనంగానే ఉండేవాడు. విస్తట్లో వడ్డించినదేదీ పారవెయ్యకూడ దన్నాడు కాబట్టి పదార్థాలలో పొరపాటున వచ్చిన మసిబొగ్గులు, బెడ్డలు, చిళ్ళ పెంకులు అవ్వీ ఏరి పారెయ్యవలసినవి కూడా మింగేసేవాడు. అతని మూర్ఖత్వం చూసి అతని భార్య ముందుగానే బొగ్గులూ, రాళ్ళూ మొదలైన వేమీ రాకుండా తీసేసి మరీ వడ్డించేది. అంతేకాదు, కూరలలో పోపుకని వేసిన మిరపకాయ ముక్కలు ఏరేసి మరీ వేసేది. ములక్కాడల్లాంటివి పడితే, గుంజుమాత్రం తిని పెచ్చులు పారెయ్యక వాటినికూడా మింగడం మొద లెడతాడు గనక, కాడలు అపళంగా వేసేదే కాదు. ఆ కాడలలోని గుంజుమాత్రం గోటితో గీరి వడ్డించేది. ఈవిధంగా ఆమె తన తెలివితేటలవల్ల భోజనంలో అతనికే ఇబ్బందీ రాకుండా చూసుకునేది.

ఎల్లకాలం ఇంట్లో కూర్చుంటే కుదురు తుందా మగవాడికి? పారుగూరు పోవలసిన పని తగిలింది నీలకంఠయ్యకు. అందుకనే ఆయన కోటిపల్లి వచ్చి; సోమప్ప యింట భోజనానికి దిగుత. భోజనం మొదలుపెట్టక ముందే అతగాడు వియ్యమ్మతో,



'అమ్మాయ్, నాకు ఇలాంటి నియమాలు ఉన్నాయి సుమా' అని చెప్పేస్తే ఇబ్బంది లేకనేపోను. కాని నీలకంఠయ్య ఆపాటి తెలివైనవాడౌతేగా? నీలకంఠయ్య సంగతి గాని అతని నియమాల మూర్ఖత్వంగాని తెలియని వియ్యమ్మ, కూర వడ్డనచేసి చూస్తో నిలబడింది. నీలకంఠయ్య నోరెత్త కుండా ఎలాగో అతి కష్టంమీద బచ్చలి కాడల పిప్పీ, మిరపకాయ ముక్కలూ మింగేశాడేకాని నియమం మాత్రం వదు లుకోలేదు.

నీలకంఠయ్య మూర్ఖత్వానికి ఇప్పుడు వియ్యమ్మ అమాయకత్వం తోడైంది. అత



గాడు బచ్చలికాడల్ని పిప్పికూడా వది తెయ్యకుండా నమిలి మింగటం చూచి, అతనికి బచ్చలి కాడలంటే మహాయిష్టం అనుకుంది. గబగబా వెళ్ళి కూరలో ఎక్క డెక్కడ ఉన్న కాడలూ ఏరితెచ్చి. నీలకం ఠయ్యను అడక్కుండానే అతని విస్తట్లో వడేసింది!

అతడు నిర్ఘాంతపోయాడు. ఆమె అదంతా మొగమాటమే అనుకుని, 'ఫరవా లేదు కొంచెమేగా వేశాను? తినండి' అంది! బాధ పడుతూ దిక్కులు చూస్తూ కాడ తర్వాత కాడ తీసుకుని సమూలంగా తినేశాడు నీలకంఠయ్య.

రెండవమాటు వేసిన కాడలు కూడా అతడు తినెయ్యటం చూసి, వియ్యామ్మ మళ్లీ పళ్లెంవద్దకు వెళ్లింది! అది గ్రహించి నీలకంఠయ్య హడలిపోయి, ఆమె విస్తరి దగ్గరకు రాకపూర్వమే, చేతులూ తలా విస్తరికి అడ్డంపెట్టి 'వొద్దు' అని తెలపకానికి తల ఊపుతూ ఐదు నిముషాలు అట్టే ఉండిపోయాడు! అప్పు డనుకున్నదామె తన మనస్సులో—నిజంగా అతను మొహ మాటపడటం లేదు అని.

బచ్చలికాడల పిప్పి మింగినప్పుడల్లా గొంతుక దిగక నీలకంఠయ్య నీళ్లు తాగవల సొచ్చేది. దాంతో కడుపు బరువెక్కి పోయింది. అందుచేత మొదట వడ్డించిన అన్నమే ఇంకా ఉంది. పులుసుముక్కలూ, కొబ్బరి పచ్చడీ 'మా మాట ఏమిటి?' అంటూ అతణ్ణి పలకరించాయి. ఆ ముక్కలు ఊత్తివి తినేసి, ఆ పచ్చడితో కొంతా, మజ్జిగతో కొంతా ఆ అన్నం తినేసి నియమం చెడకుండా లేచిపోదామని నిశ్చయించుకున్నాడు. కాని, అంతలోనే పులుసు ముక్కలలో మూడు ములగ కాడలు కనిపించాయి. పిప్పితో సహా ములక్కాడ ముక్కలు మూడూ తినేశాడు.

తరువాత పచ్చడి కలుపుదామని అన్నం ముందుకు తీసుకునేటప్పటికి, వియ్యమ్మ పులుసు రాచ్చిప్పా, గరిటా పట్టుకు చక్కా వచ్చింది. మూడు గరిటెల పులుసు వడ్డించి, 'ఇంకొక్క గరిటెడు!' అంది. విస్తట్లోపడ్డ మూడు పుంజీల ములగ కాడలూ చూసేటప్పటికి, నీలకంఠయ్యకు కళ్ళమ్మట నీళ్లు గిర్రున తిరిగినై. ఏమి చెయటానికీ తోచక ఎడంచేత్తో దబదబా నెత్తి బాదుకోడం మొదలెట్టేడు. అంత వరకూ తలయెత్తకుండా భోజనం చేస్తూన్న సోమప్ప నీలకంఠంకేసి చూసి నీర్రై పోయాడు.

'ఏమిటి బాబూ?' అని అడిగిచూశాడు కాని సమాధానం లేదు. ఏమీ అర్థంకాక సోమప్ప వియ్యమ్మవంక చూశాడు. ఆమెకుమాత్రం ఏం తెలుసు? 'ములక్కాడలు ఇష్టంగా తింటున్నారుకదా అని మిగల్చకుండా ఉన్న కాడలన్నీ వేసేశాను' అంది వియ్యమ్మ. 'వేస్తేం? ఇష్టముంటే తినవొచ్చు. లేకపోతే పారెయ్యవచ్చు. ఈమాత్రందానికి నెత్తి బాదుకు కళ్ళ నీళ్లు పెట్టుకోడం ఎందుకూ?' అని అనిపించింది సోమప్పకి.



'బాబూ అక్కర లేకపోతే వదిలి పెట్టేసెయ్యండి. దానికేం?' అన్నాడు. నీలకంఠయ్య సోమప్పకేసి తీక్షణంగా చూశాడు, ఇలా ఎందుకు చూస్తున్నాడో తెలియలేదు సోమప్పకి. ఎందుకైనా మంచిదని భార్యతో, 'వారిని అడగకుండా ఇంక ఏమీ వెయ్యకు. కావాలన్నదే తీసుకువచ్చి వడ్డించు' అన్నాడు.

నీలకంఠయ్య ఒక్కొక్క ములగకాడే నమిలి మింగేటప్పటికి చాలాసేపు పట్టింది. 'ఈయన పిప్పికూడా మింగేస్తున్నాడేమిటి?' అని సోమప్ప ఆశ్చర్యపోయాడు గాని, ఏమంటే ఏం వస్తుందో

అని ఊరుకున్నాడు. తర్వాత పచ్చడీ అన్నం కలుపుకొని తిని, మిగత అన్నం తీసుకున్నాడు. 'మజ్జిగ పొయ్యమన్నారా?' అని అడిగి, అయన 'పొయ్యండి అని సొజ్ఞ చేశాకనే, వియ్యమ్మ మజ్జిగ వడ్డించింది. నీలకంఠయ్య పొట్ట నీటితో నిండి ఉండటంచేత, ఆ మజ్జిగా అన్నం బలవంతంగానే మింగవలసి వచ్చింది. ఎలాగో ఆఖరిముద్ద కూడా మింగేసి, లేచి వెళ్ళి పెరట్లో చెయ్యి కడుక్కున్నాడు. కాని ఆపోవని భోజనం అవటంచేత, అతడు తిన్నదంతా, బచ్చలిపిప్పీ, మిరపకాయలూ సహా వెళ్లిపోయింది.

నీలకంఠయ్య ఆ దంపతులను తిడుతూ లోపలికి వచ్చి, 'ఇంక మీ గడప ఎన్నడూ తొక్కను!' అన్నాడు.

'బాబూ, మావల్ల జరిగిన అపరాధం ఏమిటి?...మీరు పిప్పిసహా తినేశారు ఎందుచేత?...ఎన్నివిధాలుగా బ్రతిమాలినా బదులు దయచేశారు కాదేమి?' అని సోమప్ప వినయంగా అడిగేడు.

నీలకంఠయ్య అగ్గి అయిపోయి, 'పిప్పి కదా అని బెదిరి, నియమం చెడగొట్టుకుంటానా? పిప్పికాదు పిడక వడ్డించినా సరే తినేస్తాను, నా నియమం ఏమనుకున్నావో! పైగా బ్రతిమాలినా సమాధానం చెప్పేనుకాదని అంటున్నావా? నువ్వు బ్రతిమాలటం కాదు, అరిచి చచ్చినా సమాధానం చెప్పను! భోజనకాలంలో మాట్లాడి నా నియమంచెడగొట్టుకుంటానా?' అంటూ గుమ్మం దిగి వెళ్ళిపోయాడు.

కోపధోరణిలో నీలకంఠయ్య అన్న ఈ మాటలవల్ల అయనకు భోజన సమయమందు రెండు నియమాలు ఉన్నట్టూ, వాటిని తనభార్య గ్రహించలేకపోయినట్టూ సోమప్పకు వెంటనే అర్థమైంది. కాని, నీలకంఠయ్య అనవసరంగా బాధపడినందుకు అతను చాలా విచారించాడు.






ఒకానొకవూళ్లో మోహన్ అనే కుర్రవాడు ఉన్నాడు. వాడు కటిక దరిద్రుడు. ఏపూట కాపూట తిండికి తడుముకోవలసి వచ్చేది. ఇంత దీనస్థితిలో ఉన్నప్పటికీ, మోహను ముఖాన విచారరేఖ అనేది ఎన్నడూ కనిపించలేదు. వాడు నిత్య సంతోషి. తను ఎప్పుడూ చిద్విలాసంగా ఉండటమేగాక దగ్గర ఉండేవాళ్లను హాస్యపుమాటలతో పకపకానవ్వించేవాడు.

ఎన్నాళ్ళకూ ఉన్నవూళ్ళో గడవకపోయే సరికి, మోహను, తనకాళ్లు ఎక్కడికితీసుకపోతే అక్కడికి పోదామని నిశ్చయించుకుని బయల్దేరాడు. పోయి పోయి కొన్నాళ్ళకు ఒక నగరం చేరుకొన్నాడు. దానిని మహాదాత ఐన ఒక ఫాదుషా పరిపాలిస్తున్నాడు. ఆ ఫాదుషా ఒక చిత్రమైన శాసనం చేసివున్నాడు; 'మా రాజ్యంలో అనాధుడు ఎవడైనా చచ్చిపోయినట్టయితే, వాని నిమిత్తం అయ్యే ఖర్చులకోసం దివాణపు ఖజానాలోనించి యాభై రూపాయిలు ఇస్తాము" అని.

ఈ శాసనం చూచి సంతోషంతో మోహను ఎగిరి గంతువేశాడు. వెంటనే ఫాదుషావద్దకు పోయి, వినయ విధేయతలు నటిస్తూ, తన కష్ట సుఖాలన్నీ పూసగుచ్చినట్టువలపోసుకొన్నాడు. చెప్పిందంతా విని ఫాదుషా "ఓయి అబ్బాయీ!—మా శాసనం కేవలమూ చచ్చిపోయినవాళ్ళకోసమే గాని, బ్రతికున్నవాళ్ళను ఉద్దేశించి ఏర్పరచిందికాదు. బ్రతికున్న వాళ్ళకేం, ఏ కష్టపడి ఐనా సంపాదించుకుంటారు. మరి దిక్కూ మొక్కూలేని అనాధులు తరించటం ఎలాగా? అందుకనే వాళ్ళను ఉద్ధరించటానికని ఈ శాసనం సృష్టించాము. కనుక నీవు వెళ్ళిపో, నీకు ఒక్క రాగికానీకూడా ఇచ్చేదిలేదు" అని చెప్పాడు.

వంకదారు సాత్యకిరావు, దోనపాడు



అప్పుడు మోహను "ప్రభూ!—ఏలిన వారు నన్నేదో బ్రతికున్నవాడిగా లెక్క వేసు కుంటున్నారు కాబోలు. ఈ కాటకాలతోటీ, రేషను తిండితోటీ సగము చచ్చేవున్నాను. కొద్దిరోజుల్లో పూర్తిగానే చచ్చిపోవచ్చు, ఆ కాస్త మాటా తమ చెవిని బడటానికి ఎంతో కాలం పట్టదుకూడాను" అన్నాడు.

"సరే, చచ్చిపోయేయి తరువాత సంగతి మేము చూసుకుంటాములే" అన్నాడు ఫాదుషా.

అందుకు మోహను "అయ్యో దేవరా!- అంత తేలికగా సెలవిస్తున్నారేమిటి? ఒక వేళ నేనుపూర్తిగా చచ్చిపోయాననుకోండి. అప్పుడు తమ శాసనంప్రకారం నానిమిత్తం యాభై రూపాయిలూ ఇవ్వక తప్పదుకదా! అందులో సగం పైకం—అంటే ఒక్క పాతిక రూపాయిలు ఇప్పుడు నాకు దయ చేస్తిరంటే నేను తమ రాజ్యం విడిచి మరొకచోటికి వెళ్ళిపోతాను. ఇలాచేయటం వల్ల తక్కిన పాతిక రూపాయిలూ తమ ఖజానాలోనే ఉండిపోతాయి. అదంతా తమకు ఆదా అన్నమాటేకద!" అని ఫాదుషాకు నచ్చచెప్పాడు.

ఈమాటలు ఫాదుషాకు బాగా నచ్చినై. ఇంతటితో పీడిపీడ వదలిపోతుంది, పాతిక రూపాయలు మిగులుతైకదా అని తక్షణమే ఖజానాలోనించి సొమ్ము తెప్పించి ఇచ్చాడు. ఇది చేతపుచ్చుకొని, మోహను మరొకవూరు పోక నగరులోనే వుంటూ, ఆ డబ్బుతో కాలక్షేపంచేస్తూ వున్నాడు.

ఇంతలో తలవని తలంపుగా, ఆ పట్టణ మంతటా మహమ్మారి వ్యాపించి, రెండు రోజులలో సగం మందిని తుడిచిపెట్టి వేసింది. అందుచేత ఊరు ఖాళీచేసి పోయి ఎక్కడైనా ప్రాణం రక్షించుకోమంటూ ప్రజలకు ఫాదుషా ఉత్తరువు చేశాడు. అప్పుడు మోహను తిరుగా ఫాదుషావద్దకు

వెళ్ళి, "మహాప్రభూ!—ఇదివరకే నేను చచ్చిపోవలసింది. కాని తమరు కరుణించి అప్పుడు నన్ను కాపాడినారు. తీరా బయల్దేరి పోదాము అనుకొనేసరికి ఇప్పుడు మరొక చావువచ్చి పడింది. చూడగా ఈసారి మరణం తప్పేటట్టు లేదే ఎలాగా అని యోచిస్తున్నాను" అని చెప్పి ఊరుకున్నాడు.

"అబ్బాయీ!— ఏమిటి యింకా ఆలోచిస్తూ కూర్చున్నావు? అలస్యం చేయకు. ఊరు వదలి వెళ్ళిపో. ప్రాణం రక్షించుకో" అంటూ ఫాదుషా వాడిని వేగిరపెట్టాడు.

"ప్రభూ!—ఇంతకుముందు తమరిప్పించిన పాతిక రూపాయిలూ కర్చయిపోయినై. కదలిపోదామంటే అస్కారం కనబడదు. అవతలమాడబోతే మహమ్మారి ముంచుకు వస్తూన్నదాయె. ఏక్షణమందు ఎవరిని కబళించుకుపోతుందో తెలియదు. ఈసారి నేను చావటమే తప్పనిసరి ఐతే ఏలినవారి ఖజానాలో మళ్లీ యాభై రూపాయలు ఖాళీ ఐపోతయ్యే. పాపం ఇదివరకే నాకు పాతిక రూపాయలు ఇచ్చివున్నారు. అవీ ఇదీ చేర్చి ఇప్పుడు మొత్తం నా



నిమిత్తమై ముప్పాతిక రూపాయలు వెచ్చించినట్టవుతుందే. కనుక, దేవరకు ఈ ఖర్చు ఎలా తప్పుతుందా అని యోచిస్తున్నాను..."అన్నాడు.

అప్పుడు ఫాదుషా వానిని మెచ్చుకుంటూ "అబ్బాయీ, మోహన్!—నీవు చూపులకు చిన్నవాడివేగాని, బలే ఉపాయశాలివి. నీ తెలివితేటలకు మేము సంతోషించాం. నీవు మా సంస్థానంలో ఒక మంత్రిగా ఉండిపోవలసింది అన్నాడు. అనాటినించి మోహను మంత్రిగా ఉంటూ తన హయాములో, బతికున్నవాళ్ళకే బాగా ఉపకారం జరిగేటట్టు ఏర్పాట్లు చేశాడు.



ప్రయుతుడనే ఋషికి అయుతుడూ, నియుతుడూ అని ఇద్దరు కొడుకులు. వాళ్లు అగస్త్యమహామునికి ప్రియశిష్యులయి విద్యలన్నీ నేర్చారు. వాళ్లంటే ఎక్కువ ప్రేమా, అభిమానం ఉండటంచేత ఆ అన్నదమ్ము లిద్దరికీ పెళ్ళిళ్లుకూడా చేసి పంపుదామని తోచింది అగస్త్యమహర్షికి. తగ్గ పిల్ల లెక్కడున్నారా అని దివ్యదృష్టితో చూసేటప్పటికి, బ్రహ్మదేవునివద్ద చక్కని చుక్క లిద్దరు కనపడ్డారు. అగస్త్యుడు తక్షణమే కమండలం పుచ్చుకొని బ్రహ్మదేవుడుండే సత్యలోకానికి వెళ్లి బ్రహ్మతో తను వచ్చిన పని చెప్పాడు. బ్రహ్మదేవుడు సంతోషంతో గాయత్రీ, సావిత్రీ అనే ఆ పిల్లల్నిద్దర్నీ అగస్త్యులవారికి సమర్పించాడు. తను వచ్చినపని ఇట్టే ఐనందుకుముని సంతోషించి ఆ పిల్లల్ని వెంటబెట్టుకుని తన ఆశ్రమానికి వచ్చేశాడు.

వచ్చి ప్రియశిష్యు లిద్దరినీ పిలిచి, "అబ్బాయ్, అయుతా, ఈ గాయత్రిని నువ్వు పెళ్లిచేసుకో. సావిత్రిని నీ తమ్ముడు వివాహం చేసుకుంటాడు" అన్నాడు. చిన్నవాడు నియుతుడు పెళ్ళి అంటే సంబర పడ్డాడు గాని అయుతుడు, "నాకు పెళ్ళి వొద్దు, పేరంటం వొద్దు" అనేశాడు.

"నేనుసత్యలోకందాకా వెళ్లి పిల్లని తెస్తే పెళ్ళి వొద్దంటావేమిటిరా అభాగ్యుడా!" అని కళ్లెర్రచేశాడు అగస్త్యమహర్షి.

కాని, అయుతుడు ఏమీ భయపడలేదు. "గురువరా—పెళ్లి చేసుకుంటే సంసార భారం నెత్తినపడుతుంది. ఈ జంజాటంలో కొట్టుకుంటూవుంటే ఇంక మోక్షం సంపాదించటం ఎలా?" అని అడిగేడు.

అగస్త్యుడు, "అప్పుడే మోక్షంమాట ఎత్తుతున్నావే? పెళ్లి చేసుకోడం మానేసినంత మాత్రాన్ని మోక్షం వచ్చి పడుతుందను

పాలంకి వెంకటరామచంద్రమూర్తి, మదరాసు

కున్నావా, పిచ్చివాడా? చిన్నప్పుడు చదువు కోవాలి. చదువు పూర్తి అయాక పెళ్లి చేసుకుని, ధర్మంగా కాలక్షేపంచేస్తూ ఇంటికి వచ్చిన అతిధులనూ, అభ్యాగతులనూ సత్కరించాలి. పిల్లల్ని కని, వంశం అభివృద్ధిలోకి తెచ్చి, పితృదేవతల ఋణాన్ని తీర్చుకోవాలి. మోక్షమనేది వానప్రస్థాశ్రమంలో తలపెట్టవలసిన మాట. బ్రహ్మచర్యం, గృహస్థాశ్రమం అయాక ముసిలితనం వచ్చినప్పుడు నువ్వు చెప్పిన సంసారపు ఝంజాటం అంతా వదిలించుకుని, నువ్వూ నీ భార్యా అడవికిపోయి 'కృష్ణా, రామా' అనుకుంటూ మోక్షంకోసం ప్రయత్నిద్దురు గానిలే. ఇప్పుడు నే చెప్పినట్లు పెళ్లి చేసుకో" అన్నాడు. అయుతుడు ఈ బోధ చెవినిపెట్టలేదు.

అయుతుడిమీద అగస్త్యుడికి కోపం వచ్చేసింది. కాని కాస్త తమాయించాడు. తనమాట వినలేదు గనక అయుతుణ్ణి ఆశ్రమంలోంచి వెళ్ళగొట్టేశాడు. బ్రహ్మవద్ద నుండి తెచ్చిన ఇద్దరు కన్యలనూ నియుతుడికే ఇచ్చి పెళ్లి చేసేశాడు.

అయుతుడు గురువుగారి ఆశ్రమాన్ని విడిచి హిమవత్పర్వతాలలోకి పోయి ఉగ్ర



మైన తపస్సు చేయసాగాడు. కొద్ది కాలంలోనే, ఈ వార్త అన్ని లోకాలకూ తెలిసిపోయింది. అందరికన్నా ముందు ఇంద్రుడికి తెలిసింది. ఎవడు గట్టి తపస్సు చేస్తున్నాడన్నా ఇంద్రుడికి భయమే. ఏమంటే, ఆ తపస్సువల్ల వాళ్లు దేవుణ్ణి ప్రత్యక్షం చేసుకుని దేవేంద్రపదవి కావాలని కోరుకుంటారేమోనని. అయుతుడి తపస్సు మాట విన్నప్పుడు కూడా ఇంద్రుడికిదే భయం పట్టుకుంది. అందుచేత ఒక బ్రాహ్మణవేషం వేసుకుని శిష్యులవేషంతో తనకూడా కొందరు దేవతల్ని వెంటబెట్టుకుని అయుతునివద్దకు వచ్చాడు. తన



వద్దనుండే కామధేనువుని ఒక సామాన్యపు అవుగా మార్చి, దానిని ఒక శిష్యుడిచేత తోలించుకు వచ్చాడు.

శిష్యులతో వచ్చిన ఆ మాయబ్రాహ్మణుడికి ఆతిథ్య మివ్వటానికి అయుతుడు పళ్ళూ, దుంపలూ మొదలైనవన్నీ తెచ్చి, శ్రమపడి స్వయంగా వడ్డించాడు. కపట బ్రాహ్మడు, "ఏం నాయనా, నువ్వే అంతపనీ చేస్తున్నావు. నీ భార్యలేదా?" అని అడిగేడు.

అయుతుడు, "నేను పెళ్ళి చేసుకోలేదు. తపస్సుచేసి త్వరగా మోక్షం సంపాదిద్దామని పెళ్లి మానేశాను" అన్నాడు. అప్పుడు ఆ వృద్ధ బ్రాహ్మణుడు, "అబ్బే, పొరపాటు చేశావు. పెళ్లి చేసుకుని సంసార సౌఖ్యా లనుభవించి ముసిలివాడి వయాక మోక్షంకోసం ప్రయత్నించాలి గాని ఇప్పుడేమిటి? ఇలా ఇబ్బందిపడక మంచి పిల్లని చూసి పెళ్ళి చేసుకో" అని సలహా ఇచ్చాడు. 'మీ కెందుకు నా గొడవ!' అంటూ నిరాకరించాడు, అయుతుడు.

ఇంద్రుడికి చాలా కోపం వచ్చింది. పోతూ పోతూ కామధేనువుని అక్కడ వదిలేసి, "కామధేనూ, నువ్విక్కడనే ఉండి, ఎలాగైనా వీడికి తగినశాస్తి చేసిరా" అని దానితో రహస్యంగా చెప్పి శిష్యులతో కూడా వెళ్ళిపోయాడు.

మర్నాడు అయుతుడు సమిధలకోసం తిరుగుతూవుంటే "అంబా" అన్న అరుపు ఒకటి వినిపించింది. ఆ ధ్వని వచ్చిన చోటుకు వెళ్లి చూస్తే, తొలినాడు ఆ ముసిలి బ్రాహ్మనివెంట వచ్చిన అవే ఒకచోట పడిపోయి లేవలేకపోయింది. "అయ్యో" అని జాలిపడి అయుతుడు ఆ అవుకి పరిచర్య చేస్తూ వచ్చాడు. క్రమంగా అది కోలుకుని లేచి నడవసాగింది. దాని సంరక్షణతో సరిపోయేసరికి తపస్సుకి తీరుబడి లేకపోయింది అయుతుడికి.



తపస్సు విఘ్నమై ఊరుకుంటే ఫరవా లేకపోను; ఆ ఆవుమూలాన్ని గొప్ప ఉపద్రవమే వచ్చింది అయుతుడికి. అది కొన్నాళ్ళకి చూడుకుని ఒక కోడెదూడని వేసింది. అతను పెట్టిన మేతవల్లా చేసిన సంరక్షణ వల్లా, ఆ ఆవూ దూడా కూడా కొద్దికాలంలో కొవ్వెక్కి, బలిసి చుట్టుపట్ల ఉన్న మునుల ఆశ్రమాలను ధ్వంసం చెయ్యటం మొదలెట్టేయి. వాళ్ళంతా వచ్చి అయుతుడితో మొఱపెట్టేరు. అప్పుడు అయుతుడు బాగా ఆలోచించి ఆ ఆవునూ దూడనూ ఎవరూ లేని ఒక అడవికి లాక్కుపోబోయాడు.

ఉన్నట్టే ఉండి ఆ ఆవు ఒక్కమాటుగా ముందుకు ఉరికి రంకెవేసింది. ఆ దూకుడులో పలుపు చేతపట్టుకున్న అయుతుడు ఒక పుట్టమీద వెళ్ళి పడ్డాడు. దెబ్బతగిలిన అతడు పుట్టమీదనుంచి లేచి వళ్లు దులుపుకుంటూవుంటే పుట్టలోంచి ఎవరో, మనిషి గొంతుకతో: "ఎవడవురా నువ్వు? నిశ్చలంగా తపస్సు చేసుకుంటూన్న నామీదకు కప్పదూకినట్టు దూకితివే! పోతిరు కప్పవై పుట్టు" అంటూ శపించాడు. అయుతుడు వణుకుతో ఆ ధ్వని వచ్చిన పుట్టకేసి చూడగా అందులో ఒక ముని ఉన్నాడు. అయుతుడు అయన పాదాలమీద పడి, క్షమించుమని వేడుకున్నాడు. ఆ ముని సంగతి గ్రహించి, వాసిపైన జాలికలిగి, ఇంద్రుడు చేసిన మోసమంతా అయుతుడికి విప్పి చెప్పాడు. "అబ్బాయీ! నా శాపానికి తిరుగులేదు. కనుక నువ్వు కప్పవై పుట్టవలసిందే. ఐతే, నీకు మోక్షం సిద్ధించటంకోసమని పాండురంగ విఠల స్వామి సన్నిధిని ఉండే కోనేటిలో నిన్ను కప్పగా పుట్టిస్తాను" అన్నాడు ఆ ముని. ఆ ప్రకారం అయుతుడు ఆ కోనేటిలో కప్ప ఐ పుట్టేడు. కామధేనువు ఇంద్రునివద్దకు పోయి జరిగిన సంగతంతా చెప్పేటప్పటికి,

'మంచి శాస్తి ఐందితే' అని దేవేంద్రుడు ఎంతో సంతోషించాడు.

కాని ఇంద్రు డనుకున్నట్లు అయుతునికి శాస్తి కానేలేదు. ఏమంటే, కప్ప అయి పుట్టినా, 'తన్నితే బూరెల బుట్టలో పడ్డట్టు' అయుతునకు కేవలమూ పాండురంగ స్వామి సాన్నిధ్యమే దొరికింది.

ఇలా ఉండగా ఒక రాజకుమార్తె చెలికత్తెలతో పాండురంగస్వామి దర్శనంకోసం అక్కడికి వచ్చింది. స్వామి పాదాలవద్ద వున్న ఆ కప్పను చూడగానే వాళ్లు తాము వచ్చిన పని మరిచి ఆ కప్పను పట్టుకోవాలని సరదా పడ్డారు. కప్ప ఆ చెలికత్తెలనందరినీ తప్పించుకుని పారిపోవా లనుకుంటూ, ఎదురుగుండా తనకోసం పొంచి వున్న ఆ రాజకుమార్తె చేతుల్లోకి వెళ్ళి చిక్కుకుంది. "చూశారా, నే పట్టేశా" నంటూ ఆ రాజకుమార్తె చేతిలో కప్పను ఆడించటం మొదలెట్టింది. ఆ దగ్గరలోనే ఒక ముని తపస్సు చేసుకుంటూ వుండగా చిన్నతనంకొద్దీ ఆ కప్పను తీసుకెళ్లి ఆయన మీద పడేసింది రాజకుమార్తె. ఆయన ఉలిక్కిపడి లేచి, "ఓసీ, వొళ్లు పొగరెక్కినట్టుందేనీకు! నాతో వేళాకోళాలా! కప్పను నామీద వేశావు గనక నీవు కప్పవై పుట్టి నీ చేతిలో వున్న ఈ కప్పనే పెళ్లాడుతావులే, పో!' అని శపించాడు.

ఇంకేముంది, మునిశాపం తిరగదుగా? ఆ రాజకుమార్తె కప్ప ఐ పుట్టింది! కప్ప రూపంలో ఉన్న అయుతుణ్ణే పెళ్ళాడింది. ఆ కప్పదంపతులకు ఒక కొడుకుకూడా పుట్టేడు. వాడు మానవునిరూపంలోనే ఉండి, పాండురంగ భక్తు డయ్యాడు.

ఆ కుర్రవాని సుకృతంవల్ల పాండురంగణ్ణి కోరుకోగా, అతని తలిదండ్రులకు మామూలు రూపాలు వచ్చినై. స్వామి దయనుపొంది అందరూ మోక్షానికి అర్హులైనారు. అయుతుని కోరిక నెరవేరింది.



# పెద్దపులికి చారలుంటే చిరుతపులికి చుక్కలున్నై

# ఎందుకో తెలుసా?




పులిపాడు అనే గ్రామంలో బ్రహ్మాండమైన వేపచెట్టు ఒకటి ఉండేది. ఆ వేపచెట్టును పోలేరమ్మ దేవత అవహించివున్నదని అక్కడి ప్రజల నమ్మకం. అందుకోసం వాళ్లంతా ఆ చెట్టుకి చక్కా పసుపు పూసి, కుంకుమబొట్లు పెట్టి పూజలూ పురస్కారాలు చేసి, ఏటా జాతరలు జరిపించి, భక్తిశ్రద్ధలతో ఆరాధించేవాళ్లు.

ఇలా ఆరాధించడంవల్ల చాలామందికి కోరుకున్న కోరికలు నెరవేరేవి. అందుకని వారికి దేవిపైన ఉండే విశ్వాసం మరీ ఎక్కువ కాజొచ్చింది. ఒకవేళ దేవి మహిమలను గురించి శంకించి, ఎవరైనా ఇష్టం వచ్చినట్టు దూషించినట్టతే వారికి వెంటనే కష్టాలూ నష్టాలూ ప్రత్యక్షంగా కనపడేవి. అటువంటప్పుడు 'తల్లీ! అపరాధం వచ్చింది క్షమించు 'మంటూ వాళ్లు చెంపలు వాయించుకోవలసివచ్చేది.

ఇలా ఉండగా—ఒక రోజున చిరుతపులి ఒకటి ఆ ప్రాంతాలకు సంచారం వచ్చింది. (ఆ కాలంలో చిరుతపులి ఒంటిన మచ్చలేవీ లేకుండా సాపుగా వుండేది.)

చిరుతపులి వచ్చివచ్చి పులిపాడులోని పోలేరమ్మ గుడి సమీపానికి చేరుకొనేసరికల్లా గ్రామదేవతకు వైభవంగా జాతర చేసుకుని తిరిగి వస్తున్న జనమంతా దాని కళ్లబడ్డారు. "సరి, ఈ జనమంతా విరగడై పోగానే నేను గుళ్లోకి వెళతాను. అక్కడ ఇవాళ మంచి మంచి ఉపారాలన్నీ దొరుకుతై. కడుపునిండా భోంచేయవచ్చు" అని లొట్టలు వేసింది, ఆ చిరుతపులి.

అనుకున్నట్టుగానే చీకటిపడటం చూసి అది గుడిలోపలికి వెళ్లింది. "ఏమిటోయమ్మ పోలేరమ్మా! వళ్లంతా బొట్లూ, చుట్టూ నూలుపోగు కట్లూ, పైగా పక్కన

ఈ నెల బహుమతి పొందిన కథ — బి. పద్మావతి, ప్రొద్దుటూరు.

* బహుమతిగా జనవరి '51 నుంచి ఒక సంవత్సరం వరకు 'చందమామ' పంపబడుతున్నది.

మెట్లు! ఓహెూ ఇంతా చేసి అమ్మవారంటే ఈ చెట్టేనా!!" అంటూ విరగబడి నవ్వింది. నవ్వి నవ్వి, చెట్టు చుట్టూ ప్రదక్షిణం చేస్తూ క్రమంగా అమ్మవారి ముందున్న ప్రసాదాలు కాజేయటానికి ప్రారంభించింది.

చిరుతపులి అంతతో ఆగలేదు. "చిత్రమైన దేవివే! చుక్కలచీర కట్టుకున్నట్టు ఎంచక్కా ఉన్నావే!" అంటూ వెటకారం చేసింది. ఈ మాటలు వినేసరికల్లా దేవి ఉగ్రురాలై ఆ గర్వించిన చిరుతపులికి బుద్ధి చెప్పాలని నిశ్చయించింది.

చిరుతపులి కడుపునిండా ప్రసాదాలు భక్షించి అడవులలోకి మరలిపోతూవుండగా మధ్యదారిలో ఒక అందమైన నాగుపాము దానివేపు వచ్చింది. చిరుతపులి ఊరుకోక 'ఓహెూ నేస్తం! నీవూ పోలేరమ్మలా నే చుక్కలచీర కట్టుకున్నావే!" హాసమాడింది. అనేసరికి ఆ నా "నాకే కాదు, నీకూవస్తుందుండు చుక్కల చీర!" అంటూ ఒక్క కాటు వేసింది. వెంటనే, తెల్లగా సఫేదులాగా వుండే చిరుతపులికి ఒళ్లంతా బొబ్బలు కనబడినై. ఇదేమిటా చిత్రం అని చూడగా నాగుపాము మాయమై దానియెదుట పోలేరమ్మ ప్రత్యక్షమైంది.

చిరుతపులి, దేవికి నమస్కరించి క్షమించమంది. అప్పుడు దేవి దయదలిచి, "ఓయి నేస్తం! వేపాకుల పసరు తీసి వంటికి రాసుకో" అని ఒకే ఒక మాట చెప్పి మాయమైంది. చిరుతపులి అలా చేసేస:కి బొబ్బలు మాయమై ఆ చోట్ల చక్కటి చుక్కలతో వెలసిపోతూ వళ్లంతా బంగారపు వన్నెతో చిరుతపులి చూడ ముచ్చటగా కనపడింది. ఇదంతా పోలేరమ్మ కటాక్షమేనని చిరుత మురిసిపోయింది. ఆనాటినించీ చిరుతపులి జాతి కంతకూ చుక్కలతో నిండిన పచ్చని, శరీరం ఏర్పడింది.



# చందమామ బొమ్మల పజిలు





# పిల్లల పెంపకం

తల్లులకు మాత్రము

## గురుభక్తి

తల్లిదండ్రుల తరవాత బిడ్డలు గౌరవించవలసినది గురువుని. తండ్రి తనువును ఇస్తే గురువు జ్ఞానభిక్ష పెడుతున్నాడు. నిజానికి బిడ్డలు పెరిగి పెద్దవారైన తరువాత సుఖ జీవనం చేయటానికి అవసరమైన సామర్థ్యమంతా గురువు చెప్పిన విద్యవల్లనే కలుగుతుంది. కనుక గురువుకి సమస్తమైన ఉపచారాలూ చేయటం శిష్యుల ధర్మం.

మంచి గురువు శిష్యులను కన్నబిడ్డలలాగానే చూచుకొంటాడు. విద్యలో గల మర్మాలన్నీ దాపరికం లేకుండా వెల్లడి చేస్తాడు. 'వీడు నాకు ప్రియశిష్యుడు' అని ఎవరిమీదనైతే గురి కుదురుతుందో, అటువంటి విద్యార్థుల్ని తనంతవారుగానూ, తనకు మించినవారినిగానూ చేయటానికి ఎంతయినా కృషి చేస్తాడు.

ఈ గురుశిష్య సంబంధం అనేది చాలా పవిత్రమైంది. పూర్వకాలమందు గురువులు ఆశ్రమాలు ఏర్పరుచుకుని, వేలకొలది విద్యార్థులను అనేక విద్యలందు ప్రవీణులుగా తరిఫీదుచేసి, పంపేవారు. వీటినే 'గురుకులాశ్రమము' లనేవారు. గురుకుల విద్య చాలా కట్టుదిట్టంగా వుండేది. గురువాజ్ఞ లేనిదే శిష్యుడు గాలికూడా పీల్చటానికి వీలులేదన్నమాట. అటువంటి గొప్ప నియమాలు గల శిక్షణలో పెరిగేవారు శిష్యులు. శిష్యులు ప్రవీణులైన తరవాత గురువు తనంతట తనే "అబ్బాయీ—నీకు విద్య పూర్తి అయింది. ఇంక నీవు వెళ్లవచ్చు" అని చెప్పి ఆశీర్వదించి పంపేవాడు. ఈవిధంగా గురువు దీవనలు పొందిన శిష్యుడు తను నేర్చిన విద్యలను ప్రపంచంలో వెదజల్లి, ఐహికంగానూ ఆముష్మికంగానూకూడా పేరుపెంపులు పొంది సుఖిస్తాడు.

మనదేశంలోని పూర్వకాలపు విద్యాపద్ధతులు చాలా చక్కగా ఉండేవి. బిడ్డలు పెద్దయాక ఆ పద్ధతులనుగురించి వివరంగా తెలుసుకోవటం అవసరం.

'మీ పెద్దమ్మ'

# అంకెల తమాషాలు

1 2 3 4 5 6 7 8 9 అని వరుసగా అంకెలు వేసుకో. ఈ అంకెలలో వరస అంకెలు ఏవైనా తీసుకో. ఎలాగంటే 1 2 3 అనిగాని, లేదా 2 3 4 5 అనిగాని, లేదా 4 5 6 7 8 9 అనిగాని వరసగా తీసుకోవచ్చు. అంటే ఏ అంకె మొదట తీసుకుంటావో ఆ అంకె తర్వాతవున్న మిగతా అంకెల వరుస మార్చకుండా నీ యిష్టం వచ్చినన్ని తీసుకోవచ్చునన్నమాట. అంతేకాని 1, 3, 5 అనికానీ 3, 7, 9 అనికానీ తీసుకోకూడదు. ఇలా నీయిష్టం వచ్చిన అంకెల్ని వేసుకున్న తర్వాత దానిని 9 చేత గుణించు. గుణించగా వచ్చిన సంఖ్య నాకు చెప్పు. నీవు వేసుకున్న సంఖ్య ఏదో నేను చెబుతాను. మచ్చుకి నీవు 2 3 4 5 6 7 అని వేసుకున్నావనుకో. దీనిని 9 చేత గుణించితే (2 3 4 5 6 7 × 9) 2 1 1 1 1 0 3 వస్తుంది. ఈ సంఖ్య నీవు చెప్పిన వెంటనే నువ్వు వేసుకున్నది 2 3 4 5 6 7 అని నేను చెప్పగలను. ఎలాగంటే, జవాబులో వచ్చే మొదటి అంకె ఎప్పుడూ నీవు వేసుకున్న సంఖ్యలోని మొదటి అంకె అవుతుంది. జవాబులో చివర వచ్చే అంకెని 10 లోంచి తీసివేస్తే నీవు వేసుకున్న సంఖ్యలోని చివరి అంకె అవుతుంది. ఇప్పుడు వచ్చిన జవాబు చూడు. మొదట 2 వచ్చింది. అంటే నీవు వేసుకున్న సంఖ్యలో మొదటి అంకె 2 అని తెలుస్తుంది. చివరి అంకె 3 కదా వచ్చింది? 10 లోంచి 3 తీసివేస్తే 7. ఇది నీవు వేసుకున్న సంఖ్యలోని చివరి అంకె 7 అని తెలుస్తుంది.

---

# కంటిని నమ్మకు!

క్రింద కనిపిస్తున్న రెండు గీతలలో ఏది పెద్దదో తెలుసా? ఓగువున వున్న గీత పెద్దదిగా కనిపిస్తున్నది కదూ? కాని నిజంగా పెద్దది కాదు. రెండు గీతలూ సమానమే. కొలిచి చూస్తే తెలిసిపోతుంది.






## ప్రేక్షకులు ఎంచుకొన్న పేకముక్క చెప్పటం

ఈ ట్రిక్కు బహు తేలిక. తేలికేకాదు ; అది చేయటానికి ముందుగా శ్రమపడి తయారు చేయవలసిన వస్తువులుకూడా లేవు.

చీట్లపేక పెట్టెలోంచి పేకదస్తా మొత్తం తీసి ప్రేక్షకులకివ్వు. ఖాళీపెట్టె నీ చేతిలోనే పట్టుకొని, ఆ చేతిని నీ వెనకవైపు వుంచుకుని, నీవీపు ప్రేక్షకులవైపు వుండేట్టు నిలబడు. ఆ తర్వాత, ప్రేక్షకుల దగ్గరవున్న పేకదస్తాలోంచి వాళ్ల యిష్టం వచ్చిన పేకముక్కను పెట్టెలో (అంకెలు పైకి కనిపించేట్టు) పెట్టి మూత పెట్టమను. తర్వాత ప్రేక్షకులవైపు తిరిగి పెట్టెలో వాళ్ళు పెట్టిన ముక్కఏదో నీవుచెప్పవచ్చు. దీని కిటుకు;

చీట్లపేక పెట్టె నీవు యింటిదగ్గరనుంచే తెచ్చుకోవాలి. పెట్టెకి ఒకవైపున క్రింది మూలన అరంగుళం వెడల్పు, ముప్పాతిక అంగుళం పొడవూ గల బెజ్జం చెయ్యి. ఇలా తయారుచేసిన పెట్టెలో పేకదస్తా పెట్టుకుని సభకు రావాలి.



తర్వాత నీవు ప్రేక్షకులముందు నిలబడినప్పుడు పెట్టెకున్న రంధ్రాన్ని నీ చేతితో మూసివుంచటం అవసరం. తర్వాత వెనుక తిరిగి నిలుచున్నప్పుడు బెజ్జంవున్న భాగం పైకి వుండేటటు చేతిలో పటుకోవాలి.

ప్రేక్షకుడు ఎంచుకున్న ముక్క వెల్లకిలా పెట్టెలో వుంచి మూసినా రంధ్రంద్వారా ఆ ముక్క ఏదో నీవు తెలుసుకోవచ్చు.

పేకముక్కల పెట్టె చేతితో పట్టుకుని, నీవు ప్రేక్షకులవైపు వుండేటట్టు నిలబడినప్పుడు, పెట్టె ఎలా పట్టుకోవాలో మొదటి బొమ్మలో చూడు. పెట్టెకు బెజ్జం ఎక్కడ ఎలా ఉండాలో రెండో బొమ్మలో చూడు.




[పాఠకులు, ఈ గారడినిగురించి సలహాలను పొందదలిస్తే, వారు 'చందమామ' పేరు ఉదహరిస్తూ ప్రొఫెసరుగారికి వ్రాయవచ్చు. ఉత్తరాలు ఇంగ్లీషులోనే వ్రాయాలి. వారి అడ్రసు యిదిః—
ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజిషియన్,
పోస్టుబాక్సు 7878, కలకత్తా—12.]

## వినోద చదరం

ఈక్రింది చదరాన్ని యిచ్చిన ఆధారముల సహాయముతో పూర్తి చెయ్యాలి. సరియైన మాటలతో గనక పూర్తి చేసినట్లయితే, అన్ని మాటలలోని చివరి అక్షరాలన్నీ ఒకేమాదిరిగా వస్తయ్. అంతేకాదు. మాటల్లోని మొదటి అక్షరాలను వరుసగా పైనుంచి క్రిందకు చదివితే ఒక మహాగ్రంథం పేరు వస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 1 | | | |
| 2 | | | |
| 3 | | | |
| 4 | | | |
| 5 | | | |
| 6 | | | |

ఆధారములు:

1. అడవిప్రాంతము　2. నవ్వు
3. బరువు　4. ధ్వని
5. తీరము　6. సంతోషము

(సరియైన జవాబుకు 55-వ పేజీ చూడండి)

బొమ్మల పజిలుకు జవాబు:

| అడ్డము | నిలువు |
|---|---|
| 1. వేమన | 1. వేషము |
| 3. శశము | 2. నక్క |
| 5. ముని | 3. శశి |
| 7. కాళి | 4. మురళి |
| 8. హేమము | 6. సుమము |
| 9. పాణి | 9. పాదుక |
| 10. శిబి | 11. బిచ్చము |
| 14. కవలు | 12. కీలు |
| 15. గళము | 13. పాద |

# రోకంటి పాటలు

[ సేకరణ : వడ్లమూడి గోపాలకృష్ణయ్య ]

తెల్లంగ తెల్లారె దేముఁ డూరేగు
తెల్లకోకల వదిన తేవే నివాళి
తిరుపతి యెంకన్న నీ పెళ్ళినాఁడు
తీరైన ముత్యాల తేరు కదిలిందా?
పాయసమ్ము కొఅకెళ్ళి పాలు కొన్నారు
పాండవులు చెరఁబోయి భూమి కొన్నారు.

* * *

విత్తనాలా గంప నెత్తి నెట్టుకొని
విచార పోయేరు వాన దేవుడికి
కురువుమంటే కురుసు కుంభవర్షమ్ము
వెలయమంటే వెలుసు నేడు ఘడియలకి.

* * *

పట్నపు వార్తల్లు ఏమి వార్తల్లు
పట్నపు ఏనుగుని ఎక్కేటి వార్తల్లు.

* * *

కూచిపూడికాడ కుక్క మొరిగింది
కూలికి పిలిచారు బొచ్చు సుబ్బయని
ఎద్దనపూడికాడ యెద్దు చచ్చింది
ఎట్టికి పిలిచారు తట్టా రామయని.

* * *

...మ్మ తమ్ముల్లార! అతి భోగులారా!
...మ్మలుండె వాడలకు తమ్ములైరండి
...ముండు వాడలకు మామలై రండి!

అల్పని మాటలను అడకే వదినా!
మన్నె దొడ్డరాజు బిడ్డలము మేము.
తల్లి తనవాడు తండ్రి తనోడు
బండికిందడ్డాడు పరదేశిబిడ్డ
పరదేశికిందాయె బండిమీదాయె
చూచార ప్రజలార పరదేశి బతుకు.

* * *

ఒళ్లు వంగనిదాన్ని పెళ్ళాడినాడు
దేశదేశాలట్టి వలసవెళ్ళాడు.
కన్న తల్లివి నీవు కావుగామున్ను
మారుతల్లికి మల్లె మాటలాడేవు.

* * *

కాలమ్ము నాటివి కమ్మన్ని బొన్నలు
మాతాత నాటివి రాజు రోకళ్ళు.

* * *

కోమటా రక్కలకి ఏమేమి సొమ్ము
వడ్డగింజసొమ్ము వళ్ళంత దుమ్ము
బాపనా రక్కలికి ఏమేమి సొమ్ము
బుజాన బిండిలూ బుడ్డి చెంబూలు.

* * *

చాకలీ ఓ లక్ష్మి అందాల లక్ష్మి
కోకలకు రావేమె కొడుకు నెత్తుకుని
బట్టలకి రావేమె పట్టి నెత్తుకుని.

## గొలుసు పాట

చిట్టిపాపా చిట్టిపాపా! ఎక్కడికెళ్ళావు?
మామగారి మేకల్ని మేపబోయాను

చిట్టిపాపా చిట్టిపాపా! మేకలేవమ్మా?
తోటలోని దొంగాడు తోలుక పోయాడు

చిట్టిపాపా చిట్టిపాపా! దొంగ ఎక్కడ?
ఏరుదాటి ఊరిలోకి పారిపొయ్యాడు

చిట్టిపాపా చిట్టిపాపా! ఊరు ఏదమ్మా?
ఏరు పొంగి వూరు నీట మునిగిపోయింది

చిట్టిపాపా చిట్టిపాపా! నీరు ఏదమ్మా?
మందలోని ఆవులొచ్చి తాగివేసినై

చిట్టిపాపా చిట్టిపాపా! ఆవు లేవమ్మా?
కోడికూత వేళకే కొండయెక్కనై

చిట్టిపాపా చిట్టిపాపా! కొండ ఎక్కడా?
మిడతలెన్నో కలిసివచ్చి మింగివేసినై

చిట్టిపాపా చిట్టిపాపా! మిడతలేమైనై?
కొల్లేటి కొంగలొచ్చి కరచుకపోయినై

చిట్టిపాపా చిట్టిపాపా! కొంగలేవమ్మా?
చెట్టుమీదికొమ్మలెక్కి చూస్తూకూర్చున్నై

చిట్టిపాపా చిట్టిపాపా! చెట్టు యెక్కడ?
కొంటె పిల్లలంతా చేరి కొట్టివేశారు

చిట్టిపాపా చిట్టిపాపా! పిల్లలేరమ్మా?
పిల్లలంతా పెళ్ళివేసుకు వెళ్లిపోయారు

## "ఎందుకో తెలుసా?"

★

"పెద్దపులికి చారలు వుంటే చిరుత పులికి చుక్కలు వున్నై" ఎందుకో తెలుసా?" అన్నదానినిగురించి మాకు వచ్చిన కథలలోకెల్లా ఉత్తమంగా వున్న కథని ఈ సంచికలో ప్రచురించాం. ఈ రచన పంపినది చి॥ బి. పద్మావతీదేవి, ప్రొద్దుటూరు. బహుమతిగా ఈ అమ్మాయికి జనవరి 1951 నించి ఒక సంవత్సరం వరకు 'చందమామ' పంపబడుచున్నది.

వచ్చేనెల (జనవరి '51) కు
దుమ్ములగొండి (సివంగి)
కుంటుతూ నడుస్తుంది?
ఎందుకో తెలుసా?

అనేదాన్నిగురించి, కథ రెండు పేజీలకు మించకుండా డిసెంబరు 15-వ తేదీ లోగా అందేట్టు ఈ అడ్రసుకు పంపండి.

"కథల తాతయ్య"
**చందమామ ఆఫీసు**
పోస్టుబాక్సు 1686, మదరాసు-1

వినోదచదరానికి జవాబు:

1. మ న్య ము
2. హ స ము
3. భా ర
4. ర వ వ
5. త ట వ
6. ము ద



రంగులు వెయ్యండి. మీరు రంగులు వేసిన బొమ్మని వచ్చేనెల (జనవరి) చందమామ అట్టమీది బొమ్మతో పోల్చుకోండి.

Controlling Editor : SRI CHAKRAPANI
NAGI REDDI at the B. N. K. Press, Madras-1